ణములనపహరించినస్వామికి, ఎన్ నిలైమై - నాస్థితిని, ఉరైత్తు - చెప్పి, పొన్ - స్పృహణీయమైన, ఉలగు - శ్రీవైకుంఠలోకమును, ఆళీర్ - అనుభవించుడి, భువని ముழுదు - లీలావిభూతి నన్నింటిని, ఆళీర్ - అనుభవించుడి.

తా॥ ఓపత్తులారా! మీరు వెళ్ళి నన్నువిరహంబునబాధపెట్టుచున్న జగద్రక్షకుఁడయిన శ్రియఃపతికి నాయవస్థను జెప్పినయెడల మీకు నేను నిత్యవిభూతిని లీలావిభూతినియిచ్చెదను. మీరనుభవింపవచ్చునని. ౧.

మైయమర్ వాళ్ నెడుంగణ్ మంగైమార్ మున్బు
ఎన్ కైయిరున్దు* నెయ్యమరిన్నడిశిల్ నిచ్చల్ పాలొడుమేవీరో*
కైయమర్ శక్కరత్తు ఎన్ కనివాయ్ప్పెరుమానై క్కణ్డు*
మెయ్యమర్ కాదల్ శొల్లి క్కిళిగాళ్ విరైన్దోడివన్దే. ౨.

అ॥ కిళిగాళ్ - ఓచిలకలారా! కై - శ్రీహస్తమందు, అమర్ - అమరియున్న, శక్కరమ్ - సుదర్శనముగలవాఁడును, కనివాయ్ - దొండపండువలెనున్న తిరుపవళముగలవాఁడునైన, ఎన్ పెరుమానై - నాస్వామిని, కణ్డు - చూచి, మెయ్ - వానితిరుమేనును (సంశ్లేషింపవలయునని), అమర్ - చేరియున్న, కాదల్ - (నా) ఆశను, శొల్లి - చెప్పి, విరైన్దు - శీఘ్రముగా, ఓడివన్దు - పఱుగెత్తివచ్చి, మై - కాటుక, అమర్ - చేరియున్న, వాళ్ - సుందరమైన, నెడుమ్ - విశాలమైన, కణ్ - నేత్రములుగల, మంగైమార్ మున్బు - సఖియలైన స్త్రీలముందఱ, ఎన్ కై - నాచేతిమీఁద, ఇరున్దు - ఉండి, నెయ్ - నెయ్యితో, అమర్ - పూర్ణమైన, ఇన్ అడిశిల్ - భోగ్యమైన ప్రసాదమును, పాలొడు - పాలుతోఁగూడ, నిచ్చల్ - ప్రతిదినమును, మేవీర్ - భుజించుడి.

తా॥ ఓచిలకలారా! మీరు శ్రియఃపతివద్దకేఁగి, నిన్ను సంశ్లేషింప నేనాశపడుచున్నానని నేను చెప్పినట్లు చెప్పి తిరిగివచ్చితిరేని మిమ్ములను నాచేతిమీఁదనుంచుకొని నెయ్యిపాలుతోఁగూడ మధురమైన ప్రసాదమునిచ్చెదను, మీరారగింపవచ్చునని. ౨.

ఓడివన్దెన్ కుழల్ మేల్ ఒళిమామలరూదీరో*
కూడియవణ్డినఙ్గాళ్ కురునాడుడైయైవర్ గట్కాయ్*
ఆడియమానెడున్దేర్ప్పడై నీఱెழச్చెఱ్ఱపిరాన్*
శూడియతణ్డుళవమున్డ తూమదువాయ్గళ్ కొణ్డే. 3.

అ॥ కూడియ - గుంపుగాఁజేరియున్న, వణ్డినఙ్గాళ్ - ఓతుమ్మెదసమూహములారా! కురునాడుడై - కురుదేశమునకు రాజులైన, ఐవర్గట్కాయ్ - పంచపాణ్డవులకొఱకై, ఆడియ - అందముగాసంచరించుచున్న, మా - గుఱ్ఱములు జోడించిన, నెడుమ్ తేర్ - గొప్పరథమును (సాధనముగాఁజేసికొని), పడై - సేనలను, నీఱెழ - భస్మమగునట్లు, శెఱ్ఱ - చంపిన, పిరాన్ - శ్రీకృష్ణుఁడు, శూడియ - అలంకరించుకొనిన, తణ్ - చల్లనైన, తుళవమ్ - తులసీమాలికయందున్న తేనెను, ఉణ్డ - భుజించిన, తూ - పరిశుద్ధమైన, మదు - తేనెగల, వాయ్గళ్ కొణ్డు - నోరు గలవారై, ఓడివన్దు - పఱుగెత్తివచ్చి, ఎన్ కుழల్ మేల్ - నాకొప్పుమీదనున్న, ఒళి - ప్రకా

ంచుచున్న, మా - శ్లాఘ్యమైన, మలర్ - పుష్పములమీఁదనున్న మకరందమును, ఊదీర్ - పానముజేయుండు.

తా॥ ఓతుమ్మెదలారా! పాండవులకు సారథ్యముజేసి దుర్యోధనాదులను జయించిన శ్రీకృష్ణుని వనమాలమీఁదనున్న మకరందమును ద్రాగి వానికి నామాటలను జెప్పివచ్చితిరేని వాకొప్పుమీఁదనున్న మధురమైన పుష్పమకరందమును పానముజేయవచ్చునని. ౩.

తూమదువాయ్గళ్కొణ్డువన్దు ముల్లైగళ్ మేల్తుమ్బిగాళ్*
పూమదువుణ్ణచ్చెల్లిల్ విన్ఐయేన్ఐ ప్పోఱ్ చెయ్దగన్ఱ*
మామదువార్తణ్డుళాయ్ముడి వానవర్కోన్ఐక్కణ్డు*
యామిదువోతక్కవా ఱెన్న వేణ్డుఙ్గణ్ణీర్కళ్ నుఙ్గట్కే. ౪.

అ॥ ఎన ముల్లైగళ్ మేల్ - నాముల్లపుష్పములమీఁద సంచరించుచున్న, తుమ్బిగాళ్ - ఓతుమ్మెదలారా! తూ - పరిశుద్ధమై, మదు - మధురమైన, వాయ్గళ్ కొణ్డు - మాటలను జెప్పుకొని, వన్దు - వెళ్ళి, పూమదు - పుష్పములమీఁదనున్న తేనెను, ఉణ్ణ - భుజించుటకు, శెల్లిల్ - వెళ్ళితిరేని, విన్ఐయేన్ఐ - పాపముగలనన్ను, పోఱ్ శెయ్దు - కృత్రిమముగా (స్వల్పమువలె క్షణకాలము) సంశ్లేషించి, అగన్ఱ - విడిచిపోయినవాఁడై, మా - శ్లాఘ్యమైన, మదు - తేనె, వార్ - కారుచున్న, తణ్ - చల్లనైన, తుళాయ్ - తిరుత్తుళాయిని, ముడి - కిరీటమునందుగల, వానవర్కోన్ఐ - నిత్యసూరులకుస్వామియైన శ్రియఃపతిని, కణ్డు - చూచి, యామ్ - మేము, నుఙ్గట్కు - మీయొక్క, తక్కవాఱు - దయకుపాత్రమైనవిధము, ఇదువో - ఇదియో? ఎన్న వేణ్డుమ్ కణ్డీర్ - అని చెప్పవలయును సుమండీ.

తా॥ ఓతుమ్మెదలారా! మీరు మధుపానముజేయ వెళ్ళినప్పుడు, నన్ను క్షణమాత్రము సంశ్లేషించి విడిచిపెట్టిపోయిన శ్రియఃపతినిజూచి, నీకు స్త్రీలను బాధపెట్టుటయేనా స్వభావము అని భయపడకనుండి చెప్పుఁడని. ౪.

నఙ్గట్కు నానెన్ఱు ఉరైక్కేన్ నమ్మ్బుమిన్ యాన్ వళర్త్త కిళిగాళ్*
వెఙ్గణ్ పుళ్ళూర్న్దువన్దు విన్ఐయేన్ఐ నెఞ్జఙ్గవర్న్ద*
శెఙ్గణ్ కరుముగిలై చ్చెయ్యవాయ్ చ్చెళుఙ్గఱ్పగత్తై*
ఎఙ్గుచ్చెన్ఱాగిలుఙ్గణ్డు ఇదువోతక్కవాఱెన్మినే. ౫.

అ॥ యాన్ - నేను, వళర్త్త - పెంచిన, కిళిగాళ్ - ఓచిలుకలారా! యాన్ - నేను, నుఙ్గట్కు - మీకు, ఉరైక్కేన్ - (ఒకపని) చెప్పుచున్నాను, నమ్మ్బుమిన్ - రండు. వెమ్ - (విరోధులమీఁదకోపముచే) ఎఱ్ఱనైన, కణ్ - నేత్రములుగల, పుళ్ - గరుత్మంతుని, ఊర్న్దు - నడిపించుకొని, వన్దు - వచ్చి, విన్ఐయేన్ఐ - భాగ్యహీనురాలైననాయొక్క, నెఞ్జమ్ - మనస్సును, కవర్న్ద - అపహరించినవాఁడును, శెఙ్గణ్ - ఎఱ్ఱనినేత్రములుగలవాఁడును, కరుముగిలై - నల్లనిమేఘమువంటి కాన్తిగలవాఁడును, శెయ్యవాయ్ - ఎఱ్ఱనిమోవిగలవాఁడును, శెళుఙ్గఱ్పగత్తై - సుందరమైన కల్పవృక్షమువంటివాఁడునైన శ్రియఃపతిని, ఎఙ్గాగిలుమ్ - ఎచ్చటనైనను, శెన్ఱు - వెళ్ళి, కణ్డు - చూచి, ఇదువో తక్కవాఱు - ఇదియాదయ, ఎన్మిన్ - అని చెప్పుఁడి.

పాశఱ్ఱెయ్దియిన్నే విన్నైయే నెన్నై యూழிన్నైవేన్*
ఆశఱు తూవి వెళ్ళైక్కురుగే అరుళ్ శెయ్దొరునాళ్*
మాశఱు నీలచ్చుడరుముడి వానవర్ కోనైక్కణ్డు*
ఏశఱుమ్ నుమ్మైయల్లాల్ మఱునోక్కిలళ్ పేర్ త్తుమఱ్ఱే. ౮.

అ॥ ఆశు - దోషము, అఱు - లేని, తూవి - ఱెక్కలుగల, వెళ్ళై - తెల్లనివర్ణముగల, కురుగే - ఓకొంగా! విన్నైయేన్ - పాపినైన నేను, పాశఱ్ఱు - వైవర్ణ్యమును, ఎయ్ది - పొంది, ఇన్నే - ఈవిధముగా, ఎన్నైయూழி - ఎంతకాలము, నైవేన్ - బాధపడుదును? ఒరునాళ్ - ఒకదినము, అరుళ్ శెయ్దు - కృపచేసి, మాశఱు - దోషములేని, నీలచ్చుడర్ - శ్యామమైనకాంతి గల, ముడి - కేశపాశముగల, వానవర్ కోనై - నిత్యసూరులకు స్వామియైన శ్రీయఃపతిని, కణ్డు - చూచి, ఏశఱు - దోషములేని, నుమ్మైయల్లాల్ - మిమ్ములనుతప్ప, పేర్ త్తు - మఱియు, మఱ్ఱు - ఇంకొకరిని, మఱునోక్కిలళ్ - తిరిగిచూడను. (అని చెప్పుము).

తా॥ ఓకొంగా! నేనెంతకాలమిట్లు బాధపడుదును? గాన నీవు నాయందుకృపజేసి శ్రీయఃపతివద్దకేళ్ళి, మఱియొకరినిజూడక నిన్నునే నమ్మకొనియున్న వీని నీవిట్లు పేక్షింపవచ్చునా? కటాక్షింపరాదాయని చెప్పుమయని. ౮.

పేర్ త్తుమఱ్ఱోర్ కళైకణ్ విన్నైయాట్టియేన్ నానొన్ఱిలేన్*
నీర్ త్తిరై మేలులవి యిరై తేరుమ్ పుదావినంగాళ్*
కార్ త్తిరళ్ మాముగిల్ పోల్ కణ్ణన్ విణ్ణవర్ కోనైక్కణ్డు*
వార్ త్తైగళ్ కొణ్డరుళియురై యీర్ వైగల్ వన్దిరున్దే. ౯

అ॥ నీర్ - జలములయొక్క, తిరై మేల్ - అలలుమీద, ఉలవి - సంచరించు, ఇరై - ఆహారమును, తేరుమ్ - వెదుకుచున్న, పుదావినంగాళ్ - పెద్దకొంగపక్షి సమూహములారా! విన్నైయాట్టియేన్ - పాపిష్ఠురాలైన, నాన్ - నేను, పేర్ త్తు - మఱియు, మఱ్ఱు - ఇంకొక, ఓర్ - అద్వితీయుండైన, ఒన్ఱు కళైకణ్ - ఒకరక్షకుని, ఇలేన్ - కలవాడనుకాను కార్ - వర్షాకాలమందు, తిరళ్ - చేరియున్న, మా - గొప్ప, ముగిల్ పోల్ - మేఘమువంటి (కాన్తిగల), కణ్ణన్ - ఆశ్రితపరతన్త్రుడైన, విణ్ణవర్ కోనై - నిత్యసూరులకుస్వామియైన శ్రీయఃపతిని, కణ్డు - చూచి, వార్ త్తైగళ్ కొణ్డు - (వాడు చెప్పెడు) మాటలను దీసికొనివచ్చి, అరుళి - (నాయందు) కృపజేసి, వైగల్ - ప్రతిదినమును, ఇరున్దు - ప్రీతిగలవారైయుండి, ఉరైయీర్ - చెప్పుడు.

తా॥ ఓ పెద్దకొంగపక్షులారా! మీకంటె నన్నిప్పుడు రక్షించువారెవ్వరులేరు గాన మీరువెళ్ళి శ్రీయఃపతికి నామాటనుజెప్పి వాడుచెప్పెడు బదులుమాటలను తిరిగి నాకువచ్చిచెప్పి నన్ను జీవింపించుండు. ౯.

వన్దిరున్దుమ్ముడైయ మణిచ్చేవలుమ్ నీరు మెల్లామ్*
అన్దిమొన్దువిన్ఱి యులర్ మేలమైయుమున్నంగాళ్*
ఎన్ తిరుమార్వఱ్కెన్నై యిన్నవాఱివళ్ కాణ్మిన్ఎన్ను*
మన్దిరత్తొన్ఱుణర్ త్తియురైయీర్ మఱుమాఱ్ఱంగళే. ౧౦.

అ॥ ఉమ్మైడైయీర్ - మీయొక్క, నణి - శ్లాఘ్యమైన, శేవలుమ్ - మొగపక్షియూ, నీరుమ్ - మీరును, ఎల్లామ్ - మీబంధువులందరును, వన్దిరున్దు - వచ్చియుండి, ఒన్ఱు అల్లమ్ - ఒకబాధయూ, ఇన్ఱి - లేక, అలర్మేల్ - పుష్పముమీద, అశైయుమ్ - సంచరించుచున్న, అన్నజ్గాళ్ - ఓ హంస పక్షులారా! ఎన్ - నాస్వామియైన, తిరు - పిరాట్టిని, మార్వఱ్కు - వక్షస్థలమందుగల శ్రియః పతికి, ఇవళ్ - ఈమె, ఇన్నవాఱు - ఈవిధముగానున్నది; కాణ్మిన్ - చూడుము; ఎన్ఱు - అని, మన్దిరత్తు - ఏకాంతమందు, ఎనక్కు - నన్నుద్దేశించి, ఒన్ఱు - ఒకమాటను, ఉణర్త్తి - భోధించి, మఱుమాఱ్ఱమ్ - బదులుమాటను, ఉరైయీర్ - చెప్పుఁడు.

తా॥ సపరివారముగా పుష్పముమీదసంచరించుచున్న ఓ హంసపక్షులారా! మీరు శ్రియః పతివద్దకేగి, ఇట్లుబాధపడుచున్న యీమెను కటాక్షింపరాదాయని చెప్పి దానికి వాఁడేమిబదులు చెప్పునో దానిని నాకువచ్చి చెప్పుఁడని. ౧౦,

** మాఱ్ఱజ్గళాయ్‌న్దుకొణ్డు మదుశూదపిరానడిమేల్*
నాఱ్ఱజ్గళ్ నాఱుమ్‌పొఴిల్‌శూఴ్ కురుగూర్‌చ్చడగోపన్‌శొన్న*
తోఱ్ఱజ్గళాయిరత్తుళ్ ఇవైయుమోర్‌పత్తుమ్‌వల్లార్*
ఊఱ్ఱిన్‌కణ్ నుణ్మణల్‌పోల్ ఉరుగానిఱ్పర్ నీరాయే. ౧౧.

అ॥ మాఱ్ఱజ్గళ్ - మంచిశబ్దములను, ఆయ్‌న్దుకొణ్డు - పరిశీలించుకొని, మదుశూద పిరాన్ - మధుసూదనునియొక్క, అడిమేల్ - శ్రీపాదములవిషయమై, నాఱ్ఱమ్‌కొళ్ - పరిమళములుగల, పూ - పుష్పములుగల, పొఴిల్ - తోటలచే, శూఴ్ - చుట్టఁబడిన, కురుగూర్ - తిరునగరికి స్వామియైన, శడగోపన్ - నమ్మాళ్వార్లు, శొన్న - ప్రసాదించిన, తోఱ్ఱజ్గళ్ - అవతారరూపములైన, ఆయిరత్తుళ్ - వెయ్యిపాశురములలో, ఓర్ - అద్వితీయములైన, ఇవై పత్తుమ్ - ఈపదిపాశురములను, వల్లార్ - అభ్యసించువారు, ఊఱ్ఱిన్‌కణ్ - చెలమయందున్న, నుణ్ - సూక్ష్మమైన, మణల్‌పోల్ - ఇసుకవలె, నీరాయ్ - జలమై, ఉరుగానిఱ్పర్ - కరుగుదురు.

తా॥ శ్రియఃపతివిషయమై యనాదిసిద్ధమైయున్న ద్రావిడవేదరూపమైన తిరువాయ్‌మొఴిని సాక్షాత్కరించి నమ్మాళ్వార్లు ప్రసాదించిన వెయ్యిపాశురములలో జేరిన యీపదిపాశురముల నభ్యసించువారు నమ్మాళ్వార్లవలెనే మిక్కిలిభక్తిచే గరుగుదురని. ౧౧.

ఆళ్వార్ తిరువడిగళే శరణమ్.
జీయర్ తిరువడిగళే శరణమ్.

## ౬ - ౯, తిరువాయ్‌మొఴి.

అవతారిక:— ఈ తిరువాయ్‌మొఴిలో, శ్రియఃపతివద్దకు మాతనుబంపినను వాఁడురానందున పరమపదమునందు వేంచేసియున్న వానికివినునట్లు తానే గొప్పధ్వనిజేసి పిలుచుచున్నారు.

** నీరాయ్‌నిలనాయ్ త్తీయాయ్‌క్కాలాయ్ నెడువానాయ్*
శీరార్‌శుడర్‌గళిరణ్డాయ్ చ్చివనాయయనానాయ్*

కూరారాழிవెణ్శఙ్గేన్ది కొడియేన్పాల్
వారాయ్*ఒరునాళ్ మణ్ణుమ్విణ్ణుమ్మగిழవే. ౧.

అ॥ నీరాయ్ - జలస్వరూపుడై, నిలనాయ్ - భూమియై, తీయాయ్ - అగ్నియై, కాలాయ్ - గాలియై, నెడు - విశాలమైన, వానాయ్ - ఆకాశమై, (సకలకారణస్వరూపుడై ఈపదార్థములను సృజించి వీనికన్తర్యామియై), శీరార్ - ప్రకాశముతో పూర్ణులై, శుడర్గళ్ - తేజోరూపులైన (చన్ద్రసూర్యులనెడి), ఇరణ్డాయ్ - ఇద్దరికిని అన్తర్యామియై, శివనాయ్ - రుద్రాన్తర్యామియై, అయనానాయ్ - బ్రహ్మాన్తర్యామియైయున్న ఓ శ్రియఃపతీ! కూర్ - వాడిచే, ఆర్ - పూర్ణమైన, ఆழி - సుదర్శనమును, వెణ్ - తెల్లనైన, శఙ్గు - శ్రీపాఞ్చజన్యమును, ఏన్ది - ధరించి, ఒరునాళ్ - ఒకదినము, మణ్ణుమ్ - లీలావిభూతియు, విణ్ణుమ్ - నిత్యవిభూతియు, మగిழ - సన్తోషించునట్లు, కొడియేన్పాల్ - పాపియైననావద్ద, వారాయ్ - వేంచేయుమా ?

తా॥ సకలకార్యకారణస్వరూపుడవైన ఓ శ్రియఃపతీ! నిన్ను సేవింపక నార్తుడనై నేను ఘోషింపగా నాఘోషముచే నుభయవిభూతియు నదురుచున్నవి. అట్లుమరకుండ సుఖపడునట్లు నీవు శఙ్ఖచక్రధరుడవై నాముందఱ వేంచేసి సేవసాదింపుమాయని. ౧.

మణ్ణుమ్విణ్ణుమ్మగిழ కుఱళాయ్వలఙ్గాట్టి*
మణ్ణుమ్విణ్ణుమ్కొణ్డ మాయవమ్మానే*
నణ్ణియునై నాన్ కణ్డుగన్దుకూత్తాడ*
నణ్ణియొరునాళ్ ఞాలత్తూడేనడవాయే. ౨.

అ॥ మణ్ణుమ్ - భూలోకమును, విణ్ణుమ్ - స్వర్గాదులును, మగిழ - ఆనందించునట్లు, కుఱళాయ్ - వామనబ్రహ్మచారియై, వలమ్ - సౌందర్యమనెడుబలమును, కాట్టి - (మహాబలికి) చూపించి, మణ్ణుమ్ - భూలోకమునున్ను, విణ్ణుమ్ - ఊర్ధ్వలోకములనున్ను, కొణ్డ - స్వీకరించిన, మాయమ్ - ఆశ్చర్యభూతుడవైన, అమ్మానే - ఓస్వామీ! నాన్ - నేను, ఉనై - నిన్ను, నణ్ణి - సమీపించి, కణ్డు - సేవించి, ఉగన్దు - సన్తోషించి, కూత్తాడ - నర్తనముజేయునట్లు, ఒరునాళ్ - ఒకదినము, నణ్ణి - (నన్ను) సమీపించి, ఞాలత్తూడే - భూమియందు, నడవాయ్ - సంచరించుమా.

తా॥ సకలలోకము సేవించి యానందించునట్లు అతిసుందరమైన వామనావతారంబెత్తి తనసౌందర్యముచే మహాబలిని మోహపెట్టి సమస్తలోకముల నాక్రమించిన ఓస్వామీ! అప్పుడు వారికి సేవసాదించినట్లు నాకిప్పుడు సేవసాదించి నన్ను సంతోషపెట్టుమాయని. ౨.

ఞాలత్తూడేనడన్దునిన్ఱుమ్ కిడన్దిరున్దుమ్*
శాలప్పలనాళ్ ఉగన్దోఱుయిర్గళ్ కాప్పానే*
కోలత్తిరుమామగళోడున్నైక్కూడాదే*
శాలప్పలనాళ్ అడియేనిన్నుమ్తళర్వేనో. ౩.

అ॥ ఞాలత్తూడే - భూమియందు, నడన్దుమ్ - (దణ్డకావనమందు) సంచరించియు, నిన్ఱుమ్ - (రావణవధానంతరము) నిలిచియు, కిడన్దుమ్ - (సముద్రతీరమందు) పవ్వళించియు, ఇరున్దుమ్ -

(సీతాపిరాట్టితోఁగూడ) వేంచేసియుండితివి, ఊగన్గోఱు - ప్రతియుగములయందును, కాలప్పల నాళ్ - చిరకాలము, ఉయిర్గళ్ - ప్రాణులను, కాప్పానే - రక్షించువాఁడా! కోలమ్ - సౌందర్యముగల, తిరుమామగళోడు - పెరియపిరాట్టితోఁగూడ, ఉన్నై - నిన్ను. కూడాదే - పొందక, అడియేన్ - దాసుఁడనైననేను, ఇన్నమ్ - ఇంకను, కాలప్పలనాళ్ - చిరకాలము, తళర్వేనో - శిథిలుఁడనైయుందునా?

తా॥ ఓ శ్రీయఃపతీ! రామావతారమందు భూలోకమందు చిరకాలము వేంచేసియుండి లోకులకు పలువిధములుగా సేవసాదించి రక్షించిన నీవు పెరియపిరాట్టితోఁగూడ వేంచేసియున్నప్పుడు ఆకీర్తిని సేవింపక నేనింక నెంతకాలమిట్లు బాధపడవలెనో యని. ౩.

తళర్న్దుమ్ముఱిన్దుమ్ శగడవశురరుడల్ వేఱా*
పిళన్దుపీయ త్తిరుక్కాలాణ్డ పెరుమానే*
కిళర్న్దుపిరమన్ శివ నిన్దిరన్ విణ్ణవర్ శూళ*
విళఙ్గవోరునాళ్ కాణవారాయ్ విణ్మీదే. ౪.

అ॥ శగడవశురర్ - శకటాసురుఁడు, తళర్న్దుమ్ - శిథిలమై, ముఱిన్దుమ్ - విఱిగియు, ఉడల్ - అవయవము, వేఱా - వేఱువేఱుగా, పిళన్దు - బద్ధమై, పీయ - నశించునట్లు, తిరుక్కాల్ - శ్రీపాదమును, ఆణ్డ - పరిపాలించిన, పెరుమానే - ఓస్వామీ! కిళర్న్దు - (నిన్ను సేవింపవలయునని) ఉద్యోగించి, పిరమన్ - బ్రహ్మయు, శివన్ - రుద్రుఁడును, ఇన్దిరన్ - ఇంద్రుఁడును, విణ్ణవర్ - దేవతలును, శూళ - చుట్టుకొనిస్తుతింపగా, విళఙ్గ - (ఆకాశమంత ప్రకాశించునట్లు, ఒరునాళ్ - ఒకదినము, విణ్మీదు - ఆకాశమందు, కాణ - (నేను) సేవించునట్లు, వారాయ్ - వేంచేయుము?

తా॥ ఓస్వామీ! నీవు శకటాసురుని శ్రీపాదముతోఁదన్నిసంహరించినట్టి యాశ్చర్యమును జూచి దేవతలుగుంపుగా నాకాశమందు నిలిచి స్తుతించునట్లు వారికి సేవసాదించిన విధంబున, నాకిప్పుడొకదినము సేవసాదింపుమా యని. ౪.

విణ్మీదిరుప్పాయ్ మలైమేల్ నిఱ్పాయ్ కడల్ శేర్ప్పాయ్*
మణ్మీదుళల్వాయ్ ఇవఱ్ఱుళ్ ఎఙ్గుమ్ మఱైన్దుఱైవాయ్*
ఎణ్మీదియన్ఱ పుఱవణ్డత్తాయ్ ఎనదావి*
ఉణ్మీదాడి యురుక్కాట్టాదే యొళిప్పాయో. ౫.

అ॥ విణ్మీదు - పరమపదమందు, ఇరుప్పాయ్ - వేంచేసియున్నవాఁడవై, మలైమేల్ - తిరువేంకటాద్రియందు, నిఱ్పాయ్ - నిలిచినవాఁడవై, కడల్ - క్షీరాబ్ధియందు, శేర్ప్పాయ్ - పవ్వళించినవాఁడవై, మణ్మీదు - భూలోకమందు, ఉళల్వాయ్ - సంచరించువాఁడవై, ఇవఱ్ఱుళ్ - ఈపదార్థములయందు, ఎఙ్గుమ్ - అంతట, మఱైన్దు - మఱిగియుండి, ఉఱైవాయ్ - వాసముచేయువాఁడవై, ఎణ్ - సంఖ్యలను, మీదు - పైన, ఇయన్ఱ - ఉన్న (అసంఖ్యేయములైన), పుఱమ్ - వెలుపలనున్న, అణ్డత్తాయ్ - అండములలోనున్నవాఁడవైననీవు, ఎనదు - నాయొక్క, ఆవి - ఆత్మకు, ఉళ్ మీదు - లోపలనున్నవెలుపలనున్న, ఆడి - సంచరించి, ఉరుక్కాట్టాదే - (నీ) తిరుమేనునుగనుపఱచకనే, ఒళిప్పాయో - దాచుకొనెదవా?

తా॥ సమస్తవస్తువులయందును వ్యాపించియున్న నీవు నాలోపలనుండియు నాకుఁగనుపడకపోతివంటె దానిని నేనెట్లుసహించెదనని. ౫.

పాయోరడివైత్తదన్ కీழ் ప్పరవైనిలమెల్లామ్
తాయ్*ఒరడియా లెల్లావులగుమ్ తడవన్ద
మాయోన్ *ఉన్నైక్కాణ్బాన్ వరున్దియెనైనాళుమ్*
తీయోడుడన్ శేర్ మెழுగా యులగిల్ తిరివేనో. ౬.

అ॥ ఓరడి - ఒకశ్రీపాదమును, పాయ్ - అంతటవ్యాపించునట్లు, వైత్తు - ఉంచి, అదన్ కీழ் - ఆతిరువడిక్రిందనున్న, పరవై - సముద్రముచేఁజుట్టబడిన, నిలమెల్లామ్ - భూమియంతను, తాయ్ - కొలిచి, ఓరడియాల్ - మఱియొకతిరువడిచేత, ఎల్లావులగుమ్ - ఊర్ధ్వలోకములన్నింటిని, తడవన్ద - స్పర్శించిన, మాయోన్ - ఆశ్చర్యభూతుఁడా! ఉన్నై - నిన్ను, కాణ్బాన్ - సేవింపుటకై, ఎనైనాళుమ్ - ఎల్లప్పుడును, తీయోడు - అగ్నితో, ఉడన్ - కూడ, శేర్ - చేరిన, మెழுగాయ్ - మైనమువలె, వరున్ది - బాధపడి, ఉలగిల్ - లోకమందు, తిరివేనో - తిరుగుదునా?

తా॥ ఓశ్రియఃపతీ! సకలలోకములనుగొలిచి యోగ్యులనియు అయోగ్యులనియు జూడక సమస్తప్రాణులను నీతిరువడికళ్ళచే స్పృశించి యుజ్జీవింపఁజేసిన నీయపారకారుణ్యమును దలచి నిన్ను సేవింపనాశపడి నశింపకుండను బ్రతుకకుండను నిట్లు బాధపడుచున్నానని. ౬.

ఉలగిల్ తిరియుఙ్కరుమకదియా యులగమాయ్*
ఉలగుక్కేయోరుయిరుమానాయ్ పుఱవణ్డత్తు*
అలగిల్ పొలిన్ద తిశైపత్తాయవరువేయో*
అలగిల్ పొలిన్ద అఱివిలేనుక్కరుళాయే. ౭.

అ॥ ఉలగిల్ - లోకమందు, తిరియుమ్ - నడుచుచున్న (చేయుచున్న), కరుమమ్ - పుణ్యపాపరూపములైనకర్మములనెడి, కది - ఉపాయములకు, ఆయ్ - ఫలప్రదుఁడవై, ఉలగమ్ - ఆకర్మములననుష్ఠించుచున్న అధికారులకు, ఆయ్ - ప్రవర్తకుఁడవై, ఉలగుక్కు - లోకములకు, ఓరుయిరుమ్ - ఒకయాత్మయై, ఆనాయ్ - ఉన్నవాఁడవై, పుఱవణ్డత్తు - అండము నకవతల, అలగిల్ - సంఖ్యయందు, పొలిన్ద - పూర్ణులై, (అసంఖ్యేయులై), తిశైపత్తు - పదిదిక్కులయందును, ఆయ - వ్యాప్తులైయున్న, అరువే - ఆత్మలకనిర్వాహకుఁడవైయున్న, ఓశ్రియఃపతీ ! అలగిల్ పొలిన్ద - అసంఖ్యేయములైన, అఱివిలేనుక్కు, - అజ్ఞానములుగలనాకు, అరుళాయ్ - కృపజేయుమా; ఓ అని ఆర్తధ్వని.

తా॥ పుణ్యపాపఫలములను, సకలప్రాణులను నీవేనిర్వాహకుఁడవైయుండగా నిన్నతిక్రమించి నే నేసాధనమనుష్ఠించి నిన్నుబొందెదనని. ౭.

అఱివిలేనుక్కరుళా యఱివారుయిరానాయ్*
వెఱికొళ్ శోదిమూర్త్తి యడియేన్ నెడుమాలే*

కిఱిశెయ్‌దెన్నై ప్పుఱత్తిట్టిన్నమ్ కెడుప్పాయో*
పిఱిదొన్ఱఱియా అడియేన్ ఆవిదిగైక్కవే. ౮.

అ॥ అఱివార్ - జ్ఞానవంతులను, ఉయిరానాయ్ - నీకాత్మగాగలవాఁడవై, వెఱికొళ్ - పరిమళించుచున్న, శోది - తేజోమయమైన, మూర్తి - విగ్రహముగలవాఁడవై, అడియేన్ - దాసునియందు, నెడుమాలే - మిక్కిలి వ్యామోహముగలవాఁడవైయున్న ఓస్వామీ! అఱివిలేనుక్కు - బుద్ధిహీనుఁడనైననాకు, అరుళాయ్ - కృపజేయుమా, పిఱిదు - నిన్నుదక్క వేఱైన, ఒన్ఱు - ఒకఉపాయమును, అఱియా - ఎఱుఁగని, అడియేన్ - దాసునియొక్క, ఆవి - మనసు, తిగైక్క - భ్రమించునట్లు, కిఱిశెయ్‌దు - ఏదోయొకవుపాయముజేసి, ఎన్నై - నన్ను, పుఱత్తిట్టు - బాహ్యవిషయ(సంసార)మందుబడద్రోసి, ఇన్నమ్ - ఇంకను, కెడుప్పాయో - చెడగొట్టెదవో?

తా॥ ఓశ్రియఃపతీ! నీవింతకాలమువఱకు నన్ను బరిగ్రహించనందున ఏదోయొక వుపాయముచే నన్నిఁకను సంసారమందు బడద్రోసెదవో యేమోయని భయపడుచున్నానని. ౮.

ఆవిదిగైక్క ఐవర్ కుమైక్కుమ్ శిఱ్ఱిన్బమ్*
పావియేనై ప్పలనీకాట్టి ప్పడుప్పాయో*
తావివైయమ్ కొణ్డ తడన్దామరైగట్కే*
కూవిక్కొళ్ళుమ్ కాలమిన్నమ్ కుఱుగాదో. ౯.

అ॥ ఆవి - మనస్సు, తిగైక్క - అల్లాడునట్లును, ఐవర్ - పంచేంద్రియములు, కుమైక్కుమ్ - బాధించునట్లును, శిఱు - అల్పములై, పల - అనేకములైన, ఇన్బమ్ - సుఖములను, నీ - నీవు, కాట్టి - చూపించి, పావియేనై - పాపిష్ఠుఁడనైననన్ను, పడుప్పాయో - బాధించెదవా? వైయమ్ - భూమిని, తావి - కొలిచి, కొణ్డ - స్వీకరించిన, తడమ్ - విశాలములైన, తామరైగట్కు - శ్రీపాదపద్మములయందు, కూవిక్కొళ్ళుమ్ - పిలుచుకొనఁదగిన, కాలమ్ - కాలము, ఇన్నమ్ - ఇఁకను, కుఱుగాదో - సమీపించదా?

తా॥ ఎంతగొప్పజితేంద్రియునిఁగూడ వ్యాకులపఱచి చెడగొట్టదగినక్షుద్రసుఖములుగల యీసంసారమందు నన్నిదివఱకునుంచి మిక్కిలిబాధపెట్టితివి. నీతిరువడిగళ్ళయందు నన్ను జేర్చుకొనఁదగినకాలమెప్పుడు దగ్గఱవచ్చునో తెలియలేదని. ౯.

కుఱుగానీళా ఇఱుదికూడా ఎనైయూழி*
శిఱుగాపెరుగా అళవిలిన్బమ్ శేర్న్దాలుమ్*
మఱుకాలిన్ఱి మాయో నునక్కే యాళాగుమ్*
శిఱుకాలత్తై యుఱుమో అన్దో తెరియిలే. ౧౦.

అ॥ కుఱుగా - హ్రస్వముకానిదియు, నీళా - దీర్ఘముకానిదియు, ఇఱుది - నాశము, కూడా - లేనిదియు, ఎనైయూழி - ఎల్లప్పుడును, శిఱుగా - కృశింపనిదియు, పెరుగా - స్థూలముకానిదియు, అళవిల్ - అవధిలేనిదియునైన, ఇన్బమ్ - ఆత్మానుభవసుఖమును, శేర్న్దాలుమ్ - పొందినను, మాయోన్ - ఆశ్చర్యభూతుఁడా! తెరియిల్ - విచారించినయెడల, మఱు

కాల్లిన్ఱి - మఱియొకప్పుడు లేకనే, శిఱుకాలత్తై - ఒకక్షణకాలము, ఉనక్కే - నీకే, ఆళాగుమ్ - దాసుఁడై చేసెడి కైఙ్కర్యసుఖమునకు, ఉఱుమో - ఒప్పగునా ? ఎన్నో - అయ్యో ?

తా॥ వృద్ధిక్షయాదిదోషములేమియులేని యాత్మానుభవమునెడికైవల్యసుఖమును బొందెనను ఆసుఖము, నీకైఙ్కర్యసుఖముతో నెంతమాత్రము నొప్పదని. ౧౦.

‡‡ తెరిదల్ నినైదల్ ఎణ్ణల్ ఆగా త్తిరుమాలుక్కు*
ఉరియతొణ్డర్ తొణ్డర్ తొణ్డన్ శడగోపన్*
తెరియచ్చొన్న ఓరాయిరత్తుళ్ ఇప్పత్తుమ్*
ఉరియతొణ్డరాక్కుమ్ ఉలగముణ్డాఱ్కే. ౧౧.

అ॥ తెరిదల్ - శాస్త్రజ్ఞానముచేతను, నినైదల్ - మననముచేతను, ఎణ్ణల్ - ధ్యానముచేతను, ఆగా - పరిచ్ఛేదించుటకశక్యుఁడైన, తిరుమాలుక్కు - శ్రియఃపతికి, ఉరియ - అసాధారణులైన, తొణ్డర్ - దాసులైనవారికి, తొణ్డర్ - దాసభూతులైనవారికి, తొణ్డన్ - దాసుడైన, శడగోపన్ - నమ్మాళ్వార్లు, తెరియ - (భగవద్గుణములు) విశదములగునట్లు, శొన్న - సాదించిన, ఓరాయిరత్తుళ్ - అద్వితీయములైన వెయ్యిపాశురములలో, ఇప్పత్తుమ్ - ఈపదిపాశురములును, (అనుసంధించువారిని), ఉలగముణ్డాఱ్కు - జగద్రక్షకుఁడైన శ్రియఃపతికి, ఉరియతొణ్డరాక్కుమ్ - అనన్యశేషులై చేయును.

తా॥ శ్రవణమననాదులచే దెలిసికొనుట కశక్యుఁడైన శ్రియఃపతికి చరమావధిదాసులైన నమ్మాళ్వార్లు ప్రసాదించిన యీపదిపాశురముల నభ్యసించువారు భగవంతుని కనన్యభక్తుల గుదురని. ౧౨.

ఆళ్వార్ తిరువడిగళే శరణమ్.

జీయర్ తిరువడిగళే శరణమ్

౧౦ - వ తిరువాయ్మొழி.

అవతారిక:— ఈవిధంబున పరమపదమందు వినునట్లు శవబాధను ఘోషించిచెప్పినను శ్రియఃపతిరానందున దీనికి ప్రపత్తితప్ప మఱియొకవుపాయములేదని నిశ్చయించి తిరువేఙ్గడముడైయాన్ తిరువడికళ్ళలో పిరాట్టిని పురుషకారముగాజేసికొని ప్రపత్తి చేయుచున్నారు.

‡‡ ఉలగముణ్డ పెరువాయా ఉలప్పిల్ కీర్ త్తియమ్మానే*
నిలవుమ్ శుడర్ శూழ் ఒళిమూర్ త్తి నెడియాయ్ అడియేనారుయిరే*
తిలదములగుక్కాయ్ నిన్ఱ తిరువేఙ్గడత్తెమ్బెరుమానే*
కులతొల్లడియేన్ ఉనపాదమ్ కూడుమాఱుకూఱాయే. ౧.

అ॥ ఉలగమ్ - లోకములను, ఉణ్డ - ఆరగించిన, పెరువాయా - పెద్దనోటిగలవాఁడా ! ఉలప్పిల్ - అవధిలేని, కీర్ త్తి - యశస్సుగల, అమ్మానే - ఓస్వామీ ! నిలవుమ్ - నిత్యమై, శుడర్ - తేజస్సుచేత, శూழ் - వ్యాప్తమై, ఒళి - తేజోమయమైన, మూర్ త్తి - దివ్యవిగ్రహముగలవాఁడా!

నెడియాయ్ - గొప్పమహిమగలవాఁడా! అడియేన్ - దాసుఁడనైననాకు, ఆర్ - పూర్ణమైన, ఉయిరే - ప్రాణభూతుఁడా! ఉలగుక్కు - లోకములకు, తిలదమాయ్ - తిలకస్వరూపమై, నిన్ఱు - ఉన్న, తిరువేఙ్గడత్తు - వేఙ్కటాద్రిలో వేంచేసియున్న, ఎమ్పెరుమానే - నాస్వామీ! కులమ్ - కులక్రమాగతమై, తొల్ - అనాదియైన, అడియేన్ - దాస్యముగలనేను, ఉన - నీయొక్క, పాదమ్ - తిరువడికళ్ళను, కూడుమాఱు - చేరువిధమును, కూఱాయ్ - చెప్పుమా.

తా॥ నిరవధిక తేజోమయవిగ్రహుఁడవై, అనన్తకల్యాణగుణాకరుఁడవై, సకల జగద్రక్షకుఁడవై, భూలోకమున కలఙ్కారభూతమైన తిరుమలయందు వేంచేసియున్న ఓస్వామీ! నీతిరువడిఁళ్ళను నే నేవిధము చేరాఁ౦దెదనో? ఆవుపాయమును నాకు జెప్పుమాయాని. ౧.

కూఱాయ్‌నీఱాయ్‌నిలనాగి క్కొడువల్లశురర్ కులమెల్లామ్*
శీఱా వెరియుమ్‌తిరుచ్చక్కరవలవా తెణ్వ్‌వక్కోమానే*
శేఱార్‌శునై త్తామరై శెన్దీమలరుమ్ తిరువేఙ్గడత్తానే*
ఆఱావన్బిలడియేనున్నడిశేర్ వణ్ణమరుళాయే. ౨.

అ॥ కొడు - క్రూరులై, వల్ - బలిష్ఠులైన, అశురర్ - అసురులయొక్క, కులమెల్లామ్ - వంశమంతయు, కూఱాయ్ - తునకలై, నీఱాయ్ - భస్మమై, నిలనాగి - నేలరై (మనెన్న - నిశ్శేషమై) పోవునట్లు శీఱా - కోపగించి, ఎరియుమ్ - జ్వలించుచున్న, తిరుచ్చక్కరమును, వలవా - దక్షిణహస్తమందుగలవాఁడా! తెణ్వ్ - నిత్యసూరులకు, కోమానే - నాయకుఁడా! శేఱు - బురదచే, ఆర్ - పూర్ణమైన, శునై - చెలమనీళ్ళయందలి, తామరై - తామరసపుష్పము, శెమ్ - ఎఱ్ఱని, తీ - నిప్పువలె (కాన్తిగలదై), మలరుమ్ - వికసించుచున్న, తిరువేఙ్గడత్తానే - వేఙ్కటాచలమునకుస్వామియైనవాఁడా! ఆఱా - అపరిచ్ఛిన్నమైన, అన్బిల్ - (నీవిషయమైన) స్నేహములోనున్న, (స్నేహముగల), అడియేన్ - దాసుండనైననేను, ఉన్నడి - నీశ్రీపాదములను, శేర్‌వణ్ణమ్ - చేరువిధమును, అరుళాయ్ - కృపచేయుమా?

తా॥ శత్రుసంహారకమైన సుదర్శనాస్త్రవర్ణను శ్రీహస్తమందుధరించి, అతిర ణీయమైన వేంకటాద్రియందు వేంచేసియున్న ఓశ్రియఃపతీ! నాపాపములనుబోగొట్టి నీభక్తుఁడనైననన్ను నీతిరువడిళ్ళయందు జేర్చుకొనుమాయని. ౨.

వణ్ణమరుళ్‌కొళ్ అణిమేగవణ్ణా మాయవమ్మానే*
ఎణ్ణమ్బుగున్దు తిత్తిక్కుమముదే యిమైయోరదిపతియే*
తెణ్ణలరువిమణిపొన్ ముత్తలైక్కుమ్ తిరువేఙ్గడత్తానే*
అణ్ణలేయున్నడిశేర అడియేఱ్కావావెన్నాయే. ౩.

అ॥ వణ్ణమ్ - కాన్తిచేత, మరుళ్‌కొళ్ - మోహింపఁజేసెడి, అణి - శ్లాఘ్యమైన, మేగమ్ - మేఘమువంటి, వణ్ణా - కాన్తిలవాఁడా! మాయమ్ - ఆశ్చర్యచేష్టితములుగలవాఁడవై, అమ్మానే - నాస్వామియైనవాఁడా! ఎణ్ణమ్ - (నా) మనస్సులో, పుగున్దు - ప్రవేశించి, తిత్తిక్కుమ్ - తీయగానున్న, అముదే - అమృతమువంటివాఁడా! ఇమైయోర్ - నిత్యసూరులకు, అదిపతియే - స్వామి

రైయెనవాఁడా! తెళ్ - నిర్మలమై, నల్ - శ్లాఘ్యమైన, అరువి - కొండకాలవలు, మణి - రత్నములనున్ను, పొన్ - బంగారమునున్ను, ముత్తు - ముత్యములనున్ను, అలైక్కుమ్ - తీరమందు గుంపుగాఁజేర్చుచున్న, తిరువేఙ్గడత్తానే - వేఙ్కటాద్రియందు వేంచేసియున్న, అణ్ణలే - ఓ స్వామీ! ఉన్ అడిశేర - నీ శ్రీపాదమును బొందునట్లు, అడియేఱ్కు - దాసునికి, ఆ ఆ ఎన్నాయే - అయ్యో అయ్యో అని కనికరింపుమా.

తా॥ నిత్యసూరిసేవ్యుండవై యతిసుందరంబులైన దివ్యరూపచేష్టితముగలవాఁడవై తిరుమలయందు వేంచేసి నన్ను దాసునిగాఁజేసికొని నాహృదయమందుఁ బ్రవేశించియున్న ఓ శ్రియఃపతీ! ఈ సంసారమందుండి బాధపడుచున్న నన్ననుగ్రహించి నీ శ్రీపాదములయందుఁ జేర్చుకొనుమాయని.　　　౩.

ఆవావెన్నాదులగత్తైయలైక్కుమ్ అశురర్ వాణాళ్ మేల్*
తీవాయ్వాళిమழై పొழிన్ద శిలైయా తిరుమామగళ్ కేళ్వా
తేవా* శురర్గళ్ మునిక్కణజ్గళ్ విరుమ్బుమ్ తిరువేఙ్గడత్తానే*
పూవార్కழల్గళరువినైయేన్ పొరున్దుమాఱుపుణరాయే.　　　౪.

అ॥ ఆవావెన్నాదు - అయ్యో అయ్యో అని కరికరించక, ఉలగత్తై - లోకములను, అలైక్కుమ్ - బాధించుచున్న, అశురర్ - అసురులయొక్క, వాழ్నాళ్ మేల్ - జీవితకాలముమీద, తీవాయ్ - నిప్పును ముఖమందుగల, వాళి - బాణములయొక్క, మழை - వర్షమును, పొழிన్ద - కురువించుచున్న, శిలైయా - ధనుస్సుగలవాఁడా! తిరుమామగళ్ - పెరియపిరాట్టికి, కేళ్వా - వల్లభుఁడా! తేవా - ఉజ్జ్వలస్వరూపుఁడా! శురర్గళ్ - దేవతలును, మునిక్కణజ్గళ్ - ఋషులసమూహములును, వణజ్గుమ్ - నమస్కరించుచున్న, తిరువేఙ్గడత్తానే - ఓ వేఙ్కటాచలపతీ! పూ - పుష్పములతో, ఆర్ - సమానమైన, కழల్గళ్ - (నీ) శ్రీపాదములను, అరు - క్రూరమైన, వినైయేన్ - పాపముగలనేను, పొఱున్దుమాఱు - బొందెడివిధమును, పుణరాయ్ - సఙ్కల్పించుమా ?

తా॥ క్రోధులనుసంహరించఁజేసిభక్తజనులాశ్రయించునట్లు వేంకటాద్రియందు వేంచేసియున్న ఓ శ్రియఃపతీ! నాపాపములనుబోగొట్టి నీపాదములయందుఁ జేరునట్లు సఙ్కల్పించుమా యని.　　　౪.

పుణరానిన్ఱమరమేழ్ ఎయ్దవొరువిల్ వలవావో*
పుణరేయ్నిన్ఱమరమిరణ్డిన్ నడువేపోనముదల్వావో*
తిణరార్ మేగమెనక్కళిఱుశేరుమ్ తిరువేఙ్గడత్తానే*
తిణరార్ శార్ఙ్గత్తునపాదమ్ శేర్వదడియేనెన్నాళే.　　　౫.

అ॥ పుణరానిన్ఱ - గుంపుగాఁజేరియున్న, మరమేழ் - సప్తసాలవృక్షములను, అన్ఱు - అప్పుడు, ఎయ్ద - కొట్టిన, ఒరువిల్ వలవా - అద్వితీయుఁడవైన ధనుర్ధరుఁడా! పుణర్ - చేరికను, ఏయ్ - పొంది, నిన్ఱ - ఉన్న, మరమిరణ్డిన్ - మద్దివృక్షములరెండిటియొక్క, నడువే - నడుమను, పోన - వెళ్ళిన, ముదల్వా - జగత్కారణుఁడా! తిణరార్ - దట్టమై యున్న, మేగమెన - మేఘము వలెనున్న, కళిఱు - ఏనుఁగు, శేరుమ్ - చేరియున్న, తిరువేఙ్గడత్తానే - వేఙ్కటాచలమునకు

స్వామీ! తిణరార్ - బలముచేపూర్ణమైన, శార్ఙ్గమ్-ధనుస్సుగల, ఉన - నీయొక్క, పాదమ్ - తిరువడిగళ్ళను, అడియేన్ - దాసుఁడనైననేను, శేర్వను - పొందుట, ఎన్నాళ్ - ఎప్పుడు?

తా॥ ఒకవలుసగా లేకుండ గుండ్రముగా చుట్టునున్న సాలవృక్షములేడింటిని యొకబాణముచేఁగొట్టిన శూరుఁడవైన ఓవేఙ్కటాచలపతీ! ఈసంసారదుఃఖమునువదలి నీతిరువడికళ్ళనెప్పుడు చేరెదనోయని. ౫.

ఎన్నాళేనామ్మణ్ణళన్ద విణై త్తామరై గళ్ కాణ్బదఱ్కెన్ఱు*
ఎన్నాళుమ్నిన్ఱిమైయోర్గళేత్తి యిఱైఞ్జియినమినమాయ్*
మెయ్న్నామనత్తాల్వழிపాడుశెయ్యుమ్ తిరువేఙ్గడత్తానే*
మెయ్న్నానెయ్దియెన్నాళునన్నడిక్కళడియేన్ మేవువదే. ౬.

అ॥ మణ్ - భూమిని, అళన్ద - కొలిచిన, ఇణై - చేరియున్న, తామరైగళ్ - శ్రీపాదపద్మములను, నామ్ - మనము, కాణ్బదఱ్కు - సేవించుటకు, ఎన్నాళే-ఏదినమునసమ్భవించునో? ఎన్ఱు - అని, ఇమైయోర్గళ్ - నిత్యసూరులు, ఎన్నాళుమ్ - ఎల్లప్పుడును, ఇనమినమాయ్ - గుంపుగుంపుగా, నిన్ఱు - చేరియుండి, ఏత్తి - స్తుతించి, ఇఱైఞ్జి - ఆశ్రయించి, మెయ్ - శరీరముచేతను, నా - వాక్కుచేతను, మనత్తాల్ - మనస్సుచేతను, వழிపాడు-కైఙ్కర్యము, శెయ్యుమ్-చేయుచున్న, తిరువేఙ్గడత్తానే - ఓవేఙ్కటాచలపతీ! అడియేన్ - దాసుఁడనైన, నాన్ - నేను, మెయ్ - యథార్థముగా (ప్రత్యక్షముగా), ఎయ్ది - పొంది, ఉన్నడిక్కళ్ - నీశ్రీపాదములను, మేవువదు - అమరికతోఁబొందుట, ఎన్నాళ్ - ఎప్పుడో? -

తా॥ త్రివిక్రమావతారమందు లోకములను కొలిచిన నీశ్రీపాదములనుసేవింపనాశపడి నిత్యసూరులువచ్చి మనోవాక్కాయములచేఁ గైఙ్కర్యముజేయునట్లు వేఙ్కటాద్రియందు వేంచేసియున్న ఓశ్రియఃపతీ! నీశ్రీపాదములను నేనెప్పుడు ప్రత్యక్షముగాసేవించెదనో యని. ౭.

అడియేన్ మేవియమర్గిన్ఱ వముదే యిమైయోరదిపతియే*
కొడియావడుపుళ్ళుడైయానే కోలక్కనివాయ్ప్పెరుమానే*
శెడియార్వినైగళ్ తీర్మరున్దే తిరువేఙ్గడత్తెమ్పెరుమానే*
నొడియార్పొழுదుమునపాదమ్ కాణనోలాదాఱ్ఱేనే. ౮.

అ॥ అడియేన్ - దాసుఁడనైననేను, మేవి - సమీపించి, అమర్గిన్ఱ - నిరన్తరానుభవముజేయుచున్న, అముదే - అమృతమువలె భోగ్యభూతుఁడా! ఇమైయోర్ - నిత్యసూరులకు, అదిపతియే - నిర్వాహకుఁడా! అడు - (శత్రువులను) వధింపఁజేయుచున్న, పుళ్-గరుత్మంతుని, కొడియా - ధ్వజముగా, ఉడైయానే - కలవాఁడా, కోలమ్ - సుందరమై, కని - పండువలెనున్న, వాయ్ - అధరముగల, పెరుమానే - గొప్పవాఁడా! శెడి - పాపములచే, ఆర్-కలిగిన, వినైగళ్ - దుఃఖములను, తీర్ - తీర్చెడి, మరున్దే - ఔషధమువంటివాఁడా! తిరువేఙ్గడత్తు - వేఙ్కటాద్రియందు వేంచేసియున్న, ఎమ్పెరుమానే - మనస్వామీ! ఉనపాదమ్ - నీతిరువడిగళ్ళను, కాణ - సేవించుటకుఁదగిన, నోలాదు - పుణ్యముజేయక (ఉండినను), నొడియార్పొழுదుమ్ - ఒకక్షణమును, ఆఱ్ఱేన్ - (నిన్ను సేవింపక) సహించియుండలేను.

తా॥ నిత్యసూరి నిర్వాహకుడవై, సకల శత్రువులనున్ను ఆశ్రితపాపములనున్ను నశింపఁ జేయువాఁడవై, వేఙ్కటాద్రియందు వేంచేసియుండి నాకు పరమభోగ్యుండవైయున్న ఓ శ్రియఃపతీ! నిన్ను బొందుటకు నేనొక సాధనము జేయకపోయినను, సాధనానుష్ఠానము జేసినవారివలె నిన్ను సేవింప మిక్కిలి త్వరపడుచున్నానని. ౭.

నోలాదాఱ్ ఱేననపాదమ్ కాణ వెన్నునుణ్ణుణర్వ్వన్*
నీలార్ కణ్ణ త్తమ్మానుమ్ నిఱై నాన్ముగనుమిన్దిరనుమ్*
శేలేయ్ కణ్ణార్ పలర్ శూழ్విరుమ్బుమ్ తిరువేఙ్గడత్తానే*
మాలాయ్ మయక్కియడియేన్బాల్ వన్దాయ్ పోలే వారాయే. ౮.

అ॥ ఉనపాదమ్ - నీ శ్రీపాదమును, కాణ - సేవించుటకు, నోలాదు - భాగ్యముజేయక నుండియు, ఆఱ్ ఱేన్ - నిన్నువదలియుండలేను; ఎన్ఱు - అనిచెప్పి, నుణ్ - సూక్ష్మమైన, ఉణర్వ్వన్ - బుద్ధిగల, నీలార్ - నీలవర్ణముచేపూర్ణమైన, కణ్డమ్ - కణ్ఠముగల, అమ్మానుమ్ - శ్రద్ధానుఁడైనరుద్రుఁడును, నిఱై - జ్ఞానపూర్తిగల, నాన్ముగనుమ్ - చతుర్ముఖుఁడును, ఇన్దిరనుమ్ - ఇంద్రుఁడును, శేలేయ్ - మత్స్యములఁబోలిన, కణ్ణార్ - నేత్రములుగల, పలర్ - (సరస్వతి పార్వతిమొదలగు) అనేకస్త్రీలతోఁగూడ, శూழ் - చుట్టబడినవారై, మిరుమ్బుమ్ - ప్రీతితో నాశ్రయించుచున్న, తిరువేఙ్గడత్తానే - ఓవేఙ్కటాద్రినాథుఁడా! మాలాయ్ - శ్యామవర్ణముగల కృష్ణుఁడై, మయక్కి - మోహపఱచి, వన్దాయ్ పోలే - (వసుదేవాదులముందఱ) వేంచేసినట్లు, వారాయ్ - (నాముందఱ) వేంచేయుమా.

తా॥ ఓ శ్రియఃపతీ! సాధనానుష్ఠానముజేయుటి నేనుమాత్రమేగాక సాధనాంతరపరులై జ్ఞానవంతులై సమర్థులైయున్న బ్రహ్మరుద్రేంద్రాదులుగూడ నైచ్యానుసంధానముజేయుచు తమ తమ స్త్రీలతోఁగూడవచ్చి యాశ్రయించునట్లు వేంకటాద్రియందు వేంచేసియున్న నీవు, కృష్ణావతారమందు వసుదేవాదులకువచ్చి సేవసాదించినట్లు నాముందఱ వేంచేసి సేవసాదింపుమాయని. ౮.

వన్దాయ్ పోలేవారాదాయ్ వారాదాయ్ పోల్ వరువానే*
శెన్దామరై క్కణ్ శెఙ్గనివాయ్ నాల్ తోళ మదేయెనదుయిరే*
శిన్దామణిగళ్ పగరల్లైప్పగల్ శెయ్ తిరువేఙ్గడత్తానే*
అన్దోవడియేనునపాద మగలకిల్లేనిఱైయుమే. ౯.

అ॥ వన్దాయ్ పోలే - (అభక్తులకు) వచ్చినవాఁడవు (సులభుఁడు)వలెనుండి, వారాదాయ్ - రానివాడును (దుర్లభుఁడును), వారాదాయ్ పోల్ - (భక్తులకు) రానివాఁడవు (అసులభుఁడు) వలెనుండి, వరువానే - వచ్చుచున్నవాఁడవును (సులభుఁడును), శెమ్ - ఎఱ్ఱని, తామరై - పద్మము వలెనున్న, కణ్ - నేత్రములనున్ను, శెమ్ - ఎఱ్ఱని, కని - దొండపండువలెనున్న, వాయ్ - అధరమునున్ను, నాల్ తోళ్ - నాలుగుభుజములనున్నుగల, అముదే - భోగ్యభూతుఁడా! ఎనదు - నాకు, ఉయిరే - ప్రాణభూతుఁడా! శిన్దామణిగళ్ - చిన్తామణులయొక్క, పగర్ - కాన్తి, అల్లై - రాత్రిని, పగల్ శెయ్ - దినమువలెచేయుచున్న, తిరువేఙ్గడత్తానే - తిరుమలయందువేంచేసి

యున్న ఓ శ్రియఃపతీ! ఉనపాదమ్ - నీ శ్రీపాదములను, అడియేన్ - దాసుఁడనైన నేను, ఇఱై యుమ్ - క్షణమాత్రముగూడ, అగల - ఎడబాసి, కిల్లేన్ - ఉండలేను.

తా॥ భక్తులకు సులభుఁడవై యభక్తులకు దుర్లభుఁడవై యతిరమణీయంబులైన దివ్యావయవములు గలవాఁడవై, రాత్రిగూడ దినమువలె ప్రకాశించునట్లు మంచి తేజస్సుగల రత్నములచే నిండియున్న వేంకటాద్రియందు వేంచేసియున్న ఓస్వామీ! నీ శ్రీపాదములనువదలి నేనొక క్షణముగూడ నుండలేనని. ౯.

** అగలకిల్లేనిఱైయు మెన్ఱలర్ మేల్ మఙ్గై యుఱై మార్బా*
నిగరిల్ పుగழாయు లగమూన్ఱుడైయా యెన్నై యాళ్వానే*
నిగరిలమరర్ మునిక్కణఙ్గళ్ విరుమ్బుమ్ తిరువేఙ్గడత్తానే*
పుగలొన్ఱిల్లా వడియే నున్నడిక్కீழ் మర్న్దుపుగున్దేనే. ౧౦.

అ॥ ఇఱైయుమ్ - ఒకక్షణముకూడ, అగల - విశ్లేషించియుండుటకు, కిల్లేన్ - సమర్థురాలుకాను, ఎన్ఱు - అని, అలర్ మేల్ - పుష్పముమీదవాసముజేయుచున్న (నిరతిశయభోగ్యురాలైన), మఙ్గై - పెరియపిరాట్టి, ఉఱై - నిత్యవాసముజేయుచున్న, మార్బా - వక్షస్థలముగలవాఁడవై, నిగరిల్ - ఒప్పులేని, పుగழாయ్ - యశస్సుగలవాఁడవై, ఉలగమ్మూన్ఱు - మూడు లోకములను, ఉడైయాయ్ - (తనకురక్ష్యములై) కలవాఁడవై, ఎన్నై - నన్ను, ఆళ్వానే - పరిపాలించువాఁడవై, నిగరిల్ - ఒప్పులేని, అమరర్ - నిత్యసూరులును, మునిక్కణఙ్గళ్ - ఋషిసమూహములును, విరుమ్బుమ్ - ఆశపడి యాశ్రయించుచున్న, తిరువేఙ్గడత్తానే - తిరుమలయందు వేంచేసియున్న ఓస్వామీ! పుగల్ - ఉపాయము, ఒన్ఱు - ఒకటియు, ఇల్లా - లేని, అడియేన్ - దాసుఁడనైన నేను, ఉన్నడిక్కீழ் - నీ శ్రీపాదములక్రింద, అమర్న్దు - అమరియున్నవాఁడనై, పుగున్దేన్ - ప్రవేశించితిని.

తా॥ సౌన్దర్య సౌగన్ధ్య మార్దవాదిగుణములచే నిరతిశయభోగ్యురాలైన పెరియపిరాట్టికూడ క్షణకాలము విశ్లేషించియుండలేక నెల్లప్పుడును నీవక్షస్థలమందు నిత్యవాసముజేయునట్లు నిరతిశయభోగ్యభూతుఁడవై, నిరుపమానంబులైన వాత్సల్యాదికల్యాణగుణములుగలవాఁడవై, సకలజగద్రక్షకుఁడవై, నిత్యసూరిసేవ్యుఁడవై, వేంకటాద్రియందత్యన్తసులభుఁడవై వేంచేసియున్న ఓ శ్రీమన్నారాయణుఁడా! నేనుసకలోపాయములను వదలి నీతిరువడికళ్ళనే యుపాయముగానమ్మి యాశ్రయించితినని - ఈపాశురముద్వయార్థప్రతిపాదకమని పూర్వాచార్యులు నిర్వహించుదురు. ౧౦.

** అడిక్కீழ் మర్న్దుపుగున్దడియార్ వాழ்మినెన్ఱరుళ్ కొడుక్కుమ్*
పడిక్కీழ்ల్లాప్పెరుమానై ప్పழனక్కురుగూర్చ్చడగోపన్*
ముడిప్పాన్ శొన్న వాయిరత్తు త్తిరువేఙ్గడత్తుక్కివై పత్తుమ్*
పిడిత్తార్ పిడిత్తార్ వీత్తిరున్దు పెరియవానుళ్ నిలావువరే. ౧౧

అ॥ అడియార్ - ఓభక్తులారా! అడిక్కీழ் - (నా) శ్రీపాదములక్రింద, అమర్న్దు - (అనన్యప్రయోజనులై) అమరియుండి, పుగున్దు - ప్రవేశించి, వాழ்మిన్ - ఉజ్జీవించుడి; ఎన్ఱెన్ఱు - అనియుపదేశించి, అరుళ్ కొడుక్కుమ్ - కృపజేయుచున్న, పడి - విధమునకు, కేழ் ఇల్లా - ఒప్పులేని, పెరుమానై - సర్వేశ్వరునియుద్దేశించి, కழనమ్ - పొలములచేసమృద్ధమైన, కురుగూర్ - కురుకాపురికస్వామియైన, శడగోపన్ - నమ్మాழ்వార్లు, ముడిప్పాన్ - తనయనుభవమునవసింపజేయుటకై, శొన్న - ప్రసాదించిన, ఆయిరత్తు - వెయ్యిపాసురములలోఁజేరిన, తిరువేఙ్గడత్తుక్కు - తిరుమలకుప్రతిపాదకమైన, ఇవైపత్తుమ్ - ఈపదిపాశురములను, పిడిత్తార్ - ఆశ్రయించినవారిని (అభ్యసించినవారిని), పడిత్తార్ - ఆశ్రయించినవారు, పెరియ - గొప్పమహిమగల, వానుళ్ - పరమపదమునందు, వీఱ్ఱిరున్దు - తమ మహిమప్రకాశించునట్లుండి, నిలావువర్ - నిత్యానుభవము జేయుదురు.

తా॥ ఓభక్తులారా! మీరు మాయొక్క యీతిరువడికళ్ళనాశ్రయించి యుజ్జీవింపుడియని తనశ్రీహస్తముచే తిరువడికళ్ళను చూపుచు ఉపదేశించుచున్న నిరవధికదయావంతులైన తిరువేఙ్గడముడైయాన్ విషయమై నమ్మాழ்వార్లుప్రసాదించిన యీపదిపాశురముల నభ్యసించువారును, వారినాశ్రయించువారును శ్రీవైకుణ్ఠమందు వెళ్ళి నిత్యానన్దమునుసనుభవింతురని. ౧౧,

ఆழ்వార్ తిరువడిగళే శరణమ్.

జీయర్ తిరువడిగళే శరణమ్.

---

౬—పది, సంపూర్ణము.

ఇదివఱకు తిరువాయ్మొழிలు అఱువదింటికి పాశురములు ౬౬౦



## ౭. పత్తు, ౧-వ తిరువాయ్మొழி.

---

అవతారిక :— పెరియపిరాట్టిని పురుషకారముగా జేసికొని ప్రపత్తి చేసినప్పటికిన్ని వీరి మూలముగా ఈతిరువాయ్మొழிయనెడి మహాప్రబన్ధమును సమాప్తి చేయింపఁదలఁచి వీరిని సర్వేశ్వరుఁడు స్వీకరించనందున, ఆళ్వార్లు మిక్కిలిదుఃఖార్తులై నన్ను స్వీకరింపక ఇన్ద్రియములనడుమ పడద్రోసి బాధించుటచే నీకేమియుపయోగమని ఘోషించుచున్నారు.

‡‡ ఉళ్ణిలావియ వైవరాల్ కుమైతీర్ త్తి యెన్నై యున్ పాదపఙ్గయమ్*
నణ్ణిలావగైయే నలివానిన్నమెణ్ణుగిన్ఱాయ్*
ఎణ్ణిలా ప్పెరుమాయనే యిమైయోర్ గళేత్తుములగమూన్రుడైయ*
అణ్ణలే యముదేయప్పనే యెన్నై యాళ్వానే. ౧.

అ॥ ఎణ్ణిలా - అసఙ్ఖ్యేయమై, పెరు - అపరిచ్ఛిన్నమైన, మాయనే-ఆశ్చర్యవ్యాపారము గల ప్రకృతినిసాధనముగాగలవాఁడా ! ఇమైయోర్ గళ్ - నిత్యసూరులచే, ఏత్తుమ్ - స్తుతింపఁబడినవాఁడవై, ఉలగమ్మూన్రు - లోకములుమూడింటిని, ఉడై-తనకుశేషముగా గలవాఁడవైన, అణ్ణలే - ఓస్వామీ! అముదే - ఓభోగ్యభూతుఁడా! అప్పనే - ఉపకారకుఁడా! ఎన్నై-నన్ను, ఆళ్వానే - (ఇదివఱలో) నిర్వహించినవాఁడా! ఉళ్ - లోపల, నిలావియ - ఉన్న, ఐవరాల్-పంచేన్ద్రియములచే, కుమైతీర్ త్తి - బాధపెట్టి, ఎన్నై - నన్ను, ఉన్ - నీయొక్క, పాదపఙ్గయమ్ - శ్రీపాదపద్మములను, నణ్ణిలావగై - సమీపించకుండునట్లు, ఇన్నమ్ - ఇఁకను, నలివాన్-బాధించుటకై, ఎణ్ణుగిన్ఱాయ్ - తలఁచుచున్నావు.

తా॥ ఓశ్రియఃపతీ ! ఇదివఱలో నాకు నీవేరక్షకుఁడవని జ్ఞానమును గలిగించి రక్షించిన నీవిప్పుడు, నేను ప్రపత్తి చేసినప్పటికిన్ని, నన్ను నీతిరువడికళ్ళను బొందనివ్వక పంచేంద్రియముల నడుమ బడద్రోసిబాధించుచున్నావు. ఇదినీకు యుక్తముకాదని. ౧.

ఎన్నై యాళుమ్వన్గోవోరైన్దివై పెయ్ దిరాప్పగల్ మోదువిత్తిట్టు*
ఉన్నై నానణుగావగై శెయ్దుపోదికణ్డాయ్*
కన్నలే యముదే కార్ముగిల్వణ్ణనే కడల్ ఞాలమ్ కాక్కిన్ఱ*
మిన్నునేమియినాయ్ వినైయేనుడై వేదియనే. ౨.

అ॥ కన్నలే - పడికబెల్లమువంటివాఁడా ! అముదే - అమృతమువంటివాఁడా! కార్ - వర్షాకాలమందలి, ముగిల్ - మేఘమువంటి, వణ్ణనే - కాన్తిగలవాఁడా ! కడల్ - సముద్రముచే జుట్టఁబడిన, ఞాలమ్ - భూమిని, కాక్కిన్ఱ - రక్షించుచున్న, మిన్ను - ఉజ్జ్వలమైన, నేమియినాయ్ - సుదర్శనముఁగలవాఁడా ! వినైయేనుడై - పాపముగలనాకు, (ప్రత్యక్షముగా సేవసాదించక), వేదియనే - వేదములచేదెలిసికొనఁదగినవాఁడా! ఎన్నై - నన్ను, ఆళుమ్ - వశపఱచుకొనినవై, వన్ - క్రూరములై, కో - నన్నునియమించుచున్నవై, ఓర్ - అద్వితీయములైన, ఇవై, - ఈ, ఐన్దు - పంచేంద్రియములను, పెయ్దు - సృజించియుంచి, ఇరాప్పగల్ - రేయింబ

గళ్లు, మోదువిత్తిట్టు - పీడించునట్లుజేసి, ఉన్నై-నిన్ను, నాన్ - నేను, అణుగావణ్ణై - చేరకుండు విధమును, శెయ్దుపోదికణ్డాయ్ - చేసిపోతివిసుమా.

తా॥ నిరతిశయభోగ్యుఁడవై జాగ్రదక్షకుఁడవైన ఓశ్రియఃపతీ! నన్ను పంచేంద్రియముల నడుమ పడద్రోసి వానికి నన్నుస్వాధీనపఱచి బాధించి నీతిరువడికళ్లను బొందనివ్వకుండ చేసితివని. ౨.

వేదియానిఱ్ఱైవరాల్ విన్నైయేన్నై మోదవిత్తు*ఉన్ తిరువడి
చ్చాదియావణ్ణం నీతడుత్తెన్ పెఱుదియన్దో*
ఆదియాగియగలిడమ్పడైత్తుణ్డుమిழ்న్దుకడన్దిడన్దిట్టు*
శోదినీళ్ ముడియాయ్ తొణ్డనేన్ మదుశూదననే. 3.

అ॥ ఆదియాగి - జగత్కారణుఁడవై, అగల్ - విశాలమైన, ఇడమ్ - భూమిని, పడైత్తు - సృజించి, ఉణ్డు - మ్రింగి, ఉమిழ்న్దు - బయలుపఱచి, కడన్దు - కొలిచి, ఇడన్దిట్టు - (పాతాళము లోనుండి) పెడతీసినవాఁడవై, శోది - ప్రకాశించుచున్న, నీళ్ - దీర్ఘమైన, ముడియాయ్ - కిరీటముగలవాఁడా! తొణ్డనేన - చపలుఁడనైననాయొక్క (పాపములను), మదుశూదననే - మధువనెడి రాక్షసునిజంపినటు నశింపఁజేసినవాఁడా! వేదియానిఱ్ఱైమ్ - బాధించుచున్న, ఐవరాల్ - పంచేంద్రియములచే, విన్నైయేన్నై - పాపముగలనన్ను, మోదువిత్తు - బాధపెట్టి, ఉన్ తిరువడి - నీశ్రీపాదమును, శాదియావణ్ణై - పొందకుండునట్లు, తడుత్తు - అడ్డగించి, నీ - నీవు, ఎన్ పెఱుది - ఏఫలమునుబొందెదవు? అన్దో - అనివిషాదోక్తి.

తా॥ జగత్తును సృజించి సకలవిధములచే రక్షించిన ఓస్వామీ! ఇదివఱలో నాపాపములను బోఁగొట్టి రక్షించిన నీవిప్పుడు నన్ను పంచేంద్రియములచే పీడించి నీశ్రీపాదమును బొందకుండచేసి నందున నీకేమియు లాభములేదని. 3.

శూదునానఱియావణ్ణై శుழల్ విలియోరైవరై క్కాట్టి*ఉన్నడి
ప్పోదునానణుగావణ్ణై శెయ్దుపోదికణ్డాయ్*
యాదుమ్యావరుమిన్ఱి నిన్నగమ్పాలొడుక్కి*ఓరాలినీళ్ఇలై
మీదు శేర్ కుழవి విన్నైయేన్నై తీర్ మరున్దే. ౪.

అ॥ యాదుమ్ - సకలవచేతనములనున్ను, యావరుమ్ - సకలచేతనులనున్ను, ఇన్ఱి - లేక టియుండ ద్రక్కక, నిన్నగమ్పాల్ - నీయుదరమందు, ఒడుక్కి - అణచి, ఓర్ - ఒక, ఆలిన్ - మఱ్ఱిచెట్టుయొక్క, నీళ్ - పొడువైన, ఇలైమీదు - దళముమీద, శేర్ - పవ్వళించిన, కుழవి - బాలుఁడవై, విన్నైయేన్ - పాపియైననాయొక్క, విన్నై - పాపములను, తీర్ - పోగొట్టెడి, మరున్దే - ఔషదమువంటివాఁడా! ఓర్ - క్రూరములైన, ఐవరై - పంచేంద్రియములను, కాట్టి - చూపించి, నాన్ - నేను, శూదు - చేయదగినకృత్యమును, అఱియావణ్ణై - ఎఱుంగకుండునట్లు, శుழల్ విలి - భ్రమింపఁజేసి, ఉన్నడిప్పోదు - నీశ్రీపాదపద్మములను, నాన్ - నేను, అణుగావణ్ణై - పొందకుండునట్లు, శెయ్దుపోదికణ్డాయ్ - చేసిపోతివిసుమా.

తా॥ ప్రళయకాలమందు సకలజగత్తును దన యుదరములోనుంచుకొని వటదళమందు బవ్వళించిన ఆపద్బాంధవుఁడైన శ్రియఃపతీ! నన్ను కృత్యాకృత్యజ్ఞానములేకుఁడ భ్రమింపజేసి ఇంద్రియవశుఁడనై నీతిరువడికళ్ళను బొందకుండునట్లు చేసినందున నీకేమిపురుషార్థ? మని ౪.

తీర్ మరున్ఱిన్ఱియైన్ను నోయడుమ్ శెక్కిల్ ఇట్టుత్తిరిక్కిన్ఱ ఐవరై*
నేర్ మరుంగుడైత్తావడైత్తు నెగిళ్ప్పాన్ ఒక్కిన్ఱాయ్*
ఆర్ మరున్ఱినియాగువార్ అడలాழி యేన్ది యశురర్ వన్గులమ్*
వేర్ మరుంగఱుత్తాయ్ విణ్ణుళార్ పెరుమానేయో. ౫.

అ॥ అడల్ - యుద్ధోన్ముఖమైన, ఆழி - సుదర్శనమును, ఏన్ది - ధరించి, అశురర్ - అసురులయొక్క, వన్ - క్రూరమైన, కులమ్ - వంశమును, మరుంగువేర్ - పక్కవేరుతోఁగూడ సమూలముగా, అఱుత్తాయ్ - ఛేదించినవాఁడా! విణ్ణుళార్ - పరమపదవాసులకు, పెరుమానే - నిర్వాహకుఁడా! తీర్ - తీర్చఁదగిన, మరున్ఱు - మందు (ప్రతిక్రియ), ఇన్ఱి - లేక, ఐన్ను - అయిదు విషయములనెడి, నోయ్ - వ్యాధులచే, అడుమ్ - బాధించుచున్న, శెక్కిల్ - శరీరమనెడి యంత్రమందు, ఇట్టు - వేసి, తిరిక్కిన్ఱ - త్రిప్పుచున్న, ఐవరై - పంచేంద్రియములను, నేర్ - ఎదుటనున్న, మరుంగు - ప్రక్కలయందును, ఉడైత్తా - ఉండునట్లు, అడైత్తు - ఉంచి, నెగిళ్ప్పాన్ - తనవద్దనుండి త్రోయువారికి, ఒక్కిన్ఱాయ్ - సమానుఁడవైయున్నావు; ఇని - ఇఁక మీఁద, మరున్ఱాగువార్ - (ఈవ్యాధిని) ఔషధమువలె తీర్చువారు, ఆర్ - ఎవరగుదురు?

తా॥ ఆశ్రితశత్రువులను సమూలముగా నశింపఁజేసిన ఓస్వామీ! నన్ను శరీరమందుంచి యింద్రియములను చుట్టుగోడవలెపెట్టి కదలుటకుఁగూడ దోవలేకుఁడజేసి శబ్దాదివిషయములను నాముందట సృజించి నన్ను బాధించుట నీకుచితముకాదని. ౫.

విణ్ణుళార్ పెరుమాఱ్కడిమై శెయ్వారైయుమ్ శెఱుమైమ్బులనివై*
మణ్ణుళెన్నై పెఱ్ఱాలెన్ శెయ్యా మఱ్ఱునీయుమ్ విట్టాల్*
పణ్ణులాయ్ కవితన్నుళాయ్ పత్తియినుళ్ళాయ్ పరమీశనే* వన్దెన్
కణ్ణుళాయ్ నెఞ్జుళాయ్ శొల్లుళాయొన్ఱుశొల్లాయే ౬.

అ॥ విణ్ణుళార్ - పరమపదమందున్నవారై, పెరుమఱ్కు - సర్వేశ్వరుఁడవైననీకు, అడిమై శెయ్వారైయుమ్ - కైఙ్కర్యముజేయువారినిగూడ, శెఱుమ్ - బాధించుచున్న, ఇవై ఐమ్బులన్ - ఈపంచేంద్రియములు, మణ్ణుళ్ - భూలోకమందు, ఎన్నై - నన్ను, పెఱ్ఱాల్ - పొందినయెడల, మఱ్ఱు - మఱియు, నీయుమ్ - నీవును, విట్టాల్ - విడిచినయెడల, ఎన్ శెయ్యా - ఏమిచేయవు? పణ్ - నాయార్తధ్వనియందు, ఉళాయ్ - ఉన్నవాఁడవై, కవితన్నుళాయ్ - నామాటయందున్నవాఁడవై - పత్తియినుళ్ళాయ్ - నాభక్తియందున్నవాఁడవై, కణ్ణుళాయ్ - నేత్రములోనున్నవాఁడవై, నెఞ్జుళాయ్ - మనస్సునందున్నవాఁడవై, శొల్లుళాయ్ - నావాక్కునందున్నవాఁడవై, పరమ్ - సర్వాధికుఁడవైన, ఈశనే - నియామకుఁడా! వన్దు - వచ్చి, ఒన్ఱు - ఒకమాట, శొల్లాయ్ - చెప్పుమా.

తా॥ నిర్వికారమైన పరమపదమందు నివసించెడి గరుడప్రభృతి నిత్యసూరులనుగూడ భ్రమింపఁజేయుచున్న పంచేంద్రియములు భూలోకమందున్న నన్నేమిచేయవు? నాసకలావయవములయందు నివసించుచు నాదుఃఖములను దొలగింప సమర్థుఁడవైననీవు నాయార్తధ్వనివినియైనను వచ్చి నాకుపాయము చెప్పుమాయని. ౬.

ఒన్ఱుశొల్లిఒరు త్తినిల్‌నిఱ్కిలాద వోరైవర్ వన్‌కయవరై*
ఎన్ఱుయాన్ వెల్‌గిఱ్పనున్ తిరువరుళిల్లైయేల్*
అన్ఱుతేవరశురర్ వాఙ్గ అలై కడలరవమళావి*ఓర్
కున్ఱమ్‌వైత్తవెన్దాయ్ కొడియేన్ పరుగిన్నముదే. ౭.

అ॥ అన్ఱు - అప్పుడు, తేవర్ - దేవతలును, అశురర్ - అసురులును, వాఙ్గ, - మథనముజేయగా, అలై - అలలుకొట్టుచున్న. కడల్ - సముద్రమందు, అరవమ్ - వాసుకిని, అళావి - చుట్టి, ఓర్ - ఒక, కున్ఱమ్ - మందరపర్వతమును, వైత్త - (చలింపకుండ) నిలిపిన, ఎన్దాయ్ - ఓనాస్వామీ! కొడియేన్ - పాపియైననేను, పరుగు - పానముజేయుటకు, ఇన్ - భోగ్యమైన, అముదే - అమృతమువంటివాఁడా! ఉన్ - నీయొక్క, తిరువరుళ్ - నిరవధికమైనకృప, ఇల్లైయేల్ - లేకపోయినయెడల, ఒన్ఱుశొల్లి - ఒకమాటనుజెప్పి, ఒరుత్తినిల్ - ఒకవిధముగా, నిఱ్కిలాద - నిలువని, ఓర్ - క్రూరులైన, ఐవర్ - అయిదువిధులై, వన్ - బలిష్ఠులైన, కయవరై - ఇంద్రియములనెడిదుష్టులను, యాన్ - నేను, ఎన్ఱు - ఎప్పుడు, వెల్‌కిఱ్పన్ - జయించెదను?

తా॥ క్షీరాబ్ధియందు మందరపర్వతమునువేసి వాసుకినిద్రాడుగాజుట్టి చిలికి యమృతమును దేవతలకిచ్చిన ఉదారుఁడా! నీవుకటాక్షించనియెడల నేనింద్రియములను జయింపఁజాలనని. ౭.

ఇన్నముదెనత్తోన్ఱి యోరైవర్ యావరైయుమ్మయక్క*నీవైత్త
మున్నమాయమెల్లామ్ ముఴువేరరిన్దు*ఎన్నైయున్
శిన్నముమ్‌తిరుమూర్‌త్తియుమ్ శిన్దిత్తేత్తికైతొఴువేయరుళెనక్కు*
ఎన్నమ్మావెన్ కణ్ణా ఇమైయోర్‌దమ్‌కులముదలే. ౮.

అ॥ ఎన్నమ్మా - నాకుతల్లివంటివాఁడా! ఎన్ కణ్ణా - నాకుభవ్యమైనవాఁడా! ఇమైయోర్‌తమ్ కులమ్ - నిత్యసూరులసమూహమునకు, ముదలే - నిర్వాహకుఁడా! ఓర్ - విలక్షణములైన, ఐవర్ - శబ్దస్పర్శరూపరసగన్ధములనెడి అయిదువిషయములు, ఇన్ అముదు - నిరతిశయభోగ్యములు, ఎన - అని, తోన్ఱి - తోఁచి, యావరైయుమ్ - ఎట్టివారినిగూడ, మయక్క - భ్రమింపఁజేయుటకై, నీ - నీవు, వైత్త - ఉంచిన, మున్నమ్ - అనాదియైన, మాయమెల్లామ్ - సంసారమున్నింటిని, ముఴు - సమ్పూర్ణముగా, వేర్ - మూలమును, అరిన్దు - ఛేదించి, ఎన్నై - నన్ను, ఉన్ - నీయొక్క, శిన్నముమ్ - శఙ్ఖచక్రాది చిహ్నములనున్ను, తిరుమూర్‌త్తియుమ్ - దివ్యవిగ్రహమునున్ను, శిన్దిత్తు - ధ్యానించి, ఏత్తి - స్తుతించి, కైతొఴు - అంజలిచేయునట్లు, ఎనక్కు - నాకు, అరుళ్ - కృపఁజేయుము.

తా॥ నాయందు దతివాత్సల్యముగల ఓ స్వామీ! చూచునప్పుడే సుఖకరంబులని తోచి బ్రహ్మాదులనుగూడ భ్రమింపఁజేయుచున్న శబ్దాదివిషయములు నన్ను బాధించకుండునట్లు వానినిసమూలముగా ఛేదించి, నీదివ్యావయవాదులను ధ్యానించి స్తుతించునట్లు నాయందుకృపఁజేయుమాయని.

కులముదలడుమ్ తీవినైక్కొడువన్ కుழிయినిల్ వీழ்క్కుమైవరై *
వలముదల్ కెడుక్కుమ్ వరమే తన్దరుళ్ కణ్డాయ్ *
నిలముదలినియెవ్వులగుక్కుమ్ నిఱ్పన శెల్వన వెన * పొరుళ్
పలముదల్ పడైత్తాయ్ ఎన్ కణ్ణా ఎన్ పరఞ్జుడరే. ౯.

అ॥ నిలమ్ ముదల్ - భూమి మొదలైన, ఇని - ఇఁకనున్న, ఎవ్వులగుక్కుమ్ - సమస్తలోకములయందును, నిఱ్పన శెల్వనఎన - స్థావరజంగమములనెడి, పలపొరుళ్ - అనేక వస్తువులను, ముదల్ - సృష్టికాలమందు, పడైత్తాయ్ - సృజించినవాఁడా! ఎన్ కణ్ణా - నాసులభ్యమైనవాఁడా! ఎన్ - నాకుసేవసాదించిన, పరఞ్జుడరే - పరఞ్జ్యోతిస్స్వరూపుఁడా! కులమ్ - వంశమును, ముదల్ - సమూలముగా, అడుమ్ - నశింపఁజేయుచున్న, తీవినై - పాపములకుఁగారణమైన, కొడు - క్రూరమైన, వన్ - కఠినమైన, కుழிయినిల్ - సంసారమనెడుపల్లమందు, వీழ்క్కుమ్ - పడద్రోయుచున్న, ఐవరై - పంచేంద్రియములయొక్క, వలమ్ - బలమును, ముదల్ - సమూలముగా, కెడుక్కుమ్ - నశింపఁజేయుచున్న, వరమే - అనుగ్రహమును, తన్దరుళ్ కణ్డాయ్ - ఇవ్వుమా.

తా॥ సకలజగత్స్రష్టయైన ఓపరఞ్జ్యోతిస్స్వరూపుఁడా! వంశనాశకరంబులై సంసారమనెడి నరకమునకు హేతువైనపంచేంద్రియములు నన్ను బాధించకుండనశించునట్లుఅనుగ్రహింపుమాయని ౯.

ఎన్ పరఞ్జుడరేయెన్ఱున్నై అలఱ్ఱి ఉన్నిణైత్తామరైగట్కు *
అన్బురుగినిఱ్క మదునిఱ్కచ్చుమదు తన్దాయ్ *
వన్ పరఙ్గళెడుత్తైవర్ తిశైతిశై వలిత్తెఱ్ఱుగిన్ఱనర్ *
మున్ పరవైకడైన్దముదఙ్గొణ్డమూర్త్తియో. ౧౦

అ॥ మున్ - మునుపు, పరవై - సముద్రమును, కడైన్దు - చిలికి, అముదమ్ - అమృతమును, కొణ్డ - తీసిన, మూర్త్తి - ఓసర్వేశ్వరుఁడా! ఎన్ పరఞ్జుడరేఎన్ఱు - నాపరఞ్జ్యోతిస్స్వరూపుఁడా! యని, ఉన్నై - నిన్ను, అలఱ్ఱి - ఘోషించిచెప్పి, ఉన్ - నీయొక్క, ఇణై - చేరియున్న, తామరైగట్కు - శ్రీపాదపద్మములవిషయమైన, అన్బు - ప్రీతిచే, ఉరుగి - కరిగి, నిఱ్కుమ్ - ఉండదగిన, అదు - ఆభాగ్యము, నిఱ్క - ఉండగా, (దానినివ్వక), ఉమదు - శరీరమనెడిభారమును, తన్దాయ్ - ఇచ్చితివి. వన్ - క్రూరములైన, పరఙ్గళ్ - విషయముల నెడిభారములను, ఎడుత్తు - మోయించి, ఐవర్ - పంచేంద్రియములు, తిశైతిశై - ప్రతిదిక్కులయందును, వలిత్తు - ఈడిచి, ఎఱ్ఱుగిన్ఱనర్ - బాధించుచున్నవి.

తా॥ ఓస్వామీ! నాకుస్వరూపానురూపముగా నీతిరునామానుసన్ధానము చేయుదగిన భాగ్యమునివ్వక ఇంద్రియములచే బాధపడునట్లు నన్నుసంసారమందు బడద్రోసి శరీరమనెడిమహాభారమును నాశిరమ్మునమోపించితివని. ౧౦.

‡‡ కొణ్డమూర్ త్తియోర్ మూవరాయ్ కుణఙ్గళ్ పడైత్తళిత్తుక్కెడుక్కుమ్*
అప్పుణ్డరీగక్కొప్పూళ్ పునల్ప్పళ్ళియప్పనుక్కే*తొణ్డర్
తొణ్డర్ తొణ్డర్ తొణ్డన్ శడగోపన్ శొల్లాయిరత్తుళిప్పత్తుమ్*
కణ్డుపాడవల్లార్ వినైపోమ్ కఙ్గులుమ్పగలే. ౧౧.

అ॥ కుణఙ్గళ్ - సత్వరజస్తమోగుణములచే, కొణ్డ - స్వీకరింపఁబడిన, మూర్త్తి - శరీరము గల, ఓర్ - విలక్షణులైన, మూవరాయ్ - బ్రహ్మవిష్ణురుద్రులనెడి ముగ్గురిస్వరూపమై, పడైత్తు - సృజించి, అళిత్తు - రక్షించి, కెడుక్కుమ్ - సంహరించుచున్నవాఁడై, అప్పుణ్డరీగమ్ - అట్టి (జగత్కారణమైన) పద్మమును, కొప్పూళ్ - తిరునాభియందుగలవాఁడై, పునల్ - మహాజలమును, పళ్ళి - పడకగాగలవాఁడైన, అప్పనుక్కే - స్వామికే, తొణ్డర్ - దాసులైనవారికి, తొణ్డర్ - దాసభూతులకు, తొణ్డర్ - భక్తులైనవారికి, తొణ్డన్ - దాసులైన, శడగోపన్ - నమ్మాళ్వార్లు, శొల్ - ప్రసాదించిన, ఆయిరత్తుళ్ - వెయ్యిపాశురములలోఁజేరిన, ఇప్పత్తుమ్ - ఈపది పాశురములను, కణ్డు - (మనకురక్షకమని) అనుసంధించి, పాడవల్లార్ - గానముజేయువారికి, కఙ్గులుమ్పగలుమ్ - రాత్రింబగళ్లు, వినైపోమ్ - పాపములునశించును.

తా॥ రజస్తమస్స్వరూపులైన బ్రహ్మరుద్రులకన్తర్యామియైయుండి సృష్టిసంహారములను జేసి, తానుసత్వస్వరూపమైనవిష్ణ్వవతారమెత్తి రక్షించుచున్న శ్రీమన్నారాయణునికి చరమావధి దాసులైన నమ్మాళ్వార్లు ప్రసాదించిన యీపదిపాశురముల నభ్యసించువారు ఇంద్రియములచే నెప్పుడును బాధపడరని. ౧౧.

ఆ ళ్వా ర్ తి రు వ డి గ ళే శ ర ణ మ్

జీయర్ తిరువడిగళేశరణమ్

## ౨-వ, తిరువాయ్ మొళి

అవతారిక:— ఈతిరువాయ్ మొళిలో, నమ్మాళ్వార్లు భగవద్విశ్లేషమును సహింపక పెరియ పెరుమాళ్ తిరువడికళ్ళలోఁప్రపత్తిచేసి అచ్చటకూడ తనమనోరథమును లభించక దుఃఖపరవశులై ఒకపిరాట్టియవస్థను బొందియుండగా, అప్పుడాపిరాట్టియొక్కతల్లి, నాకోమార్తెవిషయమై నీవేమిసంకల్పించియున్నావని పెరియపెరుమాళ్ సంనిధిలో విన్నవించుసూక్తులను సాదించుచున్నారు.

‡‡ కఙ్గులుమ్పగలుమ్ కణ్డుయిలఱియాళ్ కణ్ణనీర్ కైగళాలిఱైక్కుమ్*
శఙ్గుశక్కరఙ్గళెన్ఱుకైకూప్పుమ్ తామరైక్కణ్ణెన్ఱేతళరుమ్*
ఎఙ్గనేతరిక్కేనున్నైవిట్టెన్నుమ్ ఇరునిలమ్కైత్తుళావిరుక్కుమ్*
శెఙ్గయల్ పాయ్నీర్ త్తిరువరఙ్గత్తాయ్ యివళ్ తిఱత్తెన్ శెయ్ గిన్ఱాయే. ౧.

అ॥ కఙ్గులుమ్ - రాత్రియందును, పగలుమ్ - దినమందును, కణ్ - నేత్రములయొక్క, తుయిల్ - నిదురను, అఱియాళ్ - ఎఱుఁగదు. కణ్ణనీర్ - కన్నీళ్ళను, కైగళాల్ - చేతులచేత, ఇఱైక్కుమ్ - జల్లును. శఙ్గుశక్కరఙ్గళెన్ఱు - శఙ్ఖచక్రములని చెప్పి, కైకూప్పుమ్ - అంజలిచే

యును తామరైక్కణ్ ఎన్ఱు - పద్మమువంటి నేత్రములని చెప్పి, తళరుమ్ - శిథిలమనస్కురాలగును, ఉన్నైవిట్టు - నిన్నువదలి, ఎజ్ఙనేతరిక్కేన్ - ఎట్లు జీవించెదను, ఎన్నుమ్ - అనిచెప్పును. ఇరు - విశాలమైన, నిలమ్ - భూమిని, కై - చేతులచే, తుழாவు - తడవుచు, ఇరుక్కుమ్ - ఉండును, శెమ్ - సుందరమైన, కయల్ - మత్స్యములు, పాయ్ - ఎగురుచున్న, నీర్ - జలములచేజుట్టబడిన, తిరువరజ్గత్తాయ్ - శ్రీరజ్గమందువసించిన ఓస్వామీ! ఇవళ్ తిఱత్తు - ఈపెవిషయమై, ఎన్ శెయ్‌గిన్ఱాయ్ - ఏమి చేయతలంచినావు

తా॥ ఓశ్రీరంగనాథస్వామీ! ఈయాழ்వార్లనెడినాయకినిన్ను విశ్లేషించియుండలేక రేయింబగళ్ళు నిద్రించక దుఃఖించుచు నీయొక్క దివ్యానువ దివ్యాయుధముల ననుసంధింప నారంభించి దానికిశక్తిలేక చేతుల నెత్తి నమస్కరించుచున్నది. ఈపెను నీవేమిచేయతలంచినావో తెలియుటలేదని.

ఎన్ శెయ్‌గిన్ఱాయెన్ తామరైక్కణ్ణా వెన్నుమ్ కణ్ణీర్ మల్‌గవిరుక్కుమ్*
ఎన్ శెయ్‌గేనెఱినీర్ త్తిరువరజ్గత్తాయెన్నుమ్ వెవ్వుయిర్ త్తుయిర్ త్తురుగుమ్*
మున్ శెయ్‌దవినైయేముగప్పడాయెన్నుమ్ ముగిల్ వణ్ణాతగవిదో వెన్నుమ్*
మున్ శెయ్‌దివ్వులగముణ్డుమిழ்న్దళన్దా యెన్గొలోముడిగిన్ఱదివట్కే. ౨.

అ॥ ఎన్ - నన్ను (వశపఱచుకొనిన) తామరైక్కణ్ణా - పద్మమువంటి నేత్రముగలవాఁడా! ఎన్ శెయ్‌గిన్ఱాయ్ - ఏమి చేయుచున్నావు, ఎన్నుమ్ - అని చెప్పును. కణ్ - నేత్రములయందు, నీర్ మల్‌గ - నీళ్లునిండునట్లు, ఇరుక్కుమ్ - ఉండును. ఎఱి - అలలుకొట్టుచున్న, నీర్ - జలముగల, తిరువరజ్గత్తాయ్ - శ్రీరంగమునకునాథుఁడా! ఎన్ శెయ్‌గేన్ - ఏమిచేసెదను, ఎన్నుమ్ - అనిచెప్పును. వెమ్ - వేడిగా, ఉయిర్ త్తుయిర్ త్తు - నిట్టూర్పులువిడిచివిడిచి, ఉరుగుమ్ - కరుగును. మున్ - జన్మాంతరమందు, శెయ్‌ద - చేసిన, వినైయే - ఓపాపమా! ముగప్పడాయ్ - నా ముందఱరమ్ము, ఎన్నుమ్ - అనిచెప్పును. ముగిల్ వణ్ణా - మేఘమువంటి వర్ణముగలవాఁడా! తగవిదో - (నీకిది) తగుమైనదా? ఎన్నుమ్ - అనిచెప్పును. ఇవ్వులగమ్ - ఈలోకములను, మున్ శెయ్‌దు - మునుపుసృజించి, ఉణ్డు - మ్రింగి, ఉమిழ்న్దు - క్రక్కి, అళన్దాయ్ - కొలిచినవాఁడా! ఇవళ్ తనక్కు - ఈపెకు, ముడివు - పర్యవసానము, ఎన్గొలో - ఎట్టిదో?

తా॥ జగద్రక్షకుఁడవైన ఓశ్రీరంగనాథుఁడా! ఈపె "ఓస్వామీ! నన్నెందుకిట్లు బాధించుచున్నావు? నేనీబాధను సహించలేనే. ఇది నాపాపమా? ఓరంగనాథా! నీవిట్లు బాధపెట్టుట మంచిదికాదు" అనిచెప్పుచున్నదే, ఈమెకేమిగతి చెప్పుమాయని. ౨.

వట్కిలళిఱైయుమ్మణివణ్ణా వెన్నుమ్ వానమే నోక్కుమ్మైయాక్కుమ్*
ఉట్కుడైయశురరుయిరెల్లామున్డ వొరువనేయెన్నుముళ్ళురుగుమ్*
కట్కిలీయునైక్కాణుమాఱరుళాయ్ కాకుత్తాకణ్ణనేయెన్నుమ్*
తిట్కొడిమదిళ్ శూழ் తిరువరజ్గత్తా యివళ్ తిఱత్తెన్ శెయ్‌దిట్టాయే. 3.

అ॥ ఇఱైయుమ్ - కొంచమైనను, వట్కు - లజ్జను, ఇలళ్ - కలదికాదు, మణివణ్ణా - నీలమాణిక్యమువంటిమేనుగలవాఁడా! ఎన్నుమ్ - అనిచెప్పును. వానమే - (నీవు పరమపదమునుంచి

అ॥ నల్లార్ - విలక్షణులైన, పలర్ - అనేకులు, వాழ் - నిత్యవాసముచేయుచున్న, కురుగూర్ - కురుకాపురికిస్వామియైన, శడగోపన్ - నమ్మాழ்వార్లయొక్క, శొల్ ఆర్ - శ్రీసూక్తులచేపూర్ణమైన, తమిழ் - ద్రావిడరూపమైన, ఆయిరత్తుళ్ - వెయ్యిపాశురములలోఁ జేరిన, సీర్ - గొప్ప, పదుర్ - పాలకులచే, శూழ் - చుట్టఁబడిన, తిరుప్పేర్ మేల్ - తిరుప్పేర విషయమైన, ఇవై పత్తుమ్ - ఈపదిపాశురములను, వల్లార్ - అభ్యసించిన, తొణ్డర్ - భక్తులకు, అల్లల్ - దుఃఖము, నిల్లా - నిలువదు (వారు), అళ్వదు - పరిపాలింపఁదగినది, శూழ் - వ్యాప్తమై (అపరిచ్ఛిన్నమై), పొన్ - తేజోమయమైన, విశుమ్బు - పరమపదము.

తా॥ తిరుప్పేరవిషయమై నమ్మాழ்వార్లుసాదించిన యీపదిపాశురముల నభ్యసించువారు సంసారమునువదలి పరమపదమును బొందుదురని. ౧౧.

ఆழ்వార్ తిరువడిగళే శరణమ్.
జీయర్ తిరువడిగళే శరణమ్.

---

## ౯ - వ, తిరువాయ్మొழி.

---

అవతారిక:—ఈతిరువాయ్మొழிలో, సర్వేశ్వరుఁడర్చిరాదిమార్గము మొదలగు వైభవములను ప్రకాశింప, వానిని యనుభవించి యస్వాపదేశముగా సాదించుచున్నారు.

‡‡ శూழ் విశుమ్బణిముగిల్ తూరియమ్ముழక్కిన*
ఆழ் కడలలై తిరై కై యెడుత్తాడిన*
ఏழ் పొழிలుమ్ వళమేన్దియ వెన్నప్పర్*
వాழ் పుగழ் నారణన్ తమరై క్కణ్డుగన్దే. ౧.

అ॥ ఎన్నప్పన్ - నాకు సకలవిధబంధువై, వాழ் పుగழ் - అనన్తకరమైన కల్యాణగుణములుగలవాఁడైన, నారణన్ - శ్రీమన్నారాయణునియొక్క, తమరై - భక్తులను, కణ్డు - చూచి, ఉగన్దు - సన్తోషించి, శూழ் - అంతట వ్యాప్తమైన, విశుమ్బు - ఆకాశమందు, అణి - అలఙ్కారముగానున్న, ముగిల్ - మేఘములు, తూరియమ్ ముழక్కిన - తూర్యఘోషమును జేసినవి. ఆழ் కడల్ - అగాధమైన సముద్రములు, అలై తిరై - కొట్టుచున్న అలలనెడి, కై ఎడుత్తు - చేతులనెత్తి, ఆడిన - నర్తనముజేసినవి. ఏழ் పొழிలుమ్ - సప్తద్వీపములును, వళమ్ - ఉపహారములను, ఏన్దియ - ధరించినవి.

తా॥ మోక్షమునకుఁబోవుచున్న శ్రీవైష్ణవులను జూచి సన్తోషముచే మేఘములు గర్జించినవి. సముద్రములయందలలు లేచినవి. భూమి తనయందున్న మంచివస్తువులను వారికి సమర్పించినవని. ౧.

నారణన్ తమరై క్కణ్డుగన్దు నన్నీర్ ముగిల్*
పూరణపొఱ్కుడమ్ పూరిత్తతుయర్ విణ్ణిల్*
నీరణికడల్గళ్ నిన్నార్ త్తన* నెడువరై
త్తోరణమ్ నిరై త్తెఙ్గుమ్ తొழுదనరులగే. ౨.

అ॥ వారణన్ తమర్గళ్ - భగవద్భక్తులను, కణ్డు - చూచి, ఉగన్దు - సన్తోషించి, నల్ నీర్ ముగిల్ - మంచిజలముగల మేఘములు, ఉయర్ - ఉన్నతమైన, విణ్ణిల్ - ఆకాశమందు, పూరణమ్ పొఱ్కుడమ్ - స్వర్ణమయమైన పూర్ణకుంభములుగా, పూరిత్తగు - పూరించియుంచ బడినవి. నీరణి - జలముచేనిండియున్న, కడల్గళ్ - సముద్రములు, నిన్ఱు - స్థిరముగానుండి, ఆర్త్తన - ఘోషించినవి. ఉలగు - లోకమందున్నవారు, నెడువరై - గొప్ప పర్వతములవలె నున్న, తోరణమ్ - తోరణములను, నిరైత్తు - (కట్టి) నింపించి, తొழுదనర్ - ఆశ్రయించిరి.

తా॥ మోక్షమునకువెళ్ళుచున్న భాగవతులను జూచి మేఘములు సన్తోషించి పూర్ణకుంభముల వలెనాయెను. సముద్రములు ఘోషించెను. లోకులు సుందరముగా తోరణములుగట్టి వారిని సేవించితిరని. ౨.

తొழுదనరులగర్గళ్ తూబనన్మలర్ మழை
పొழிవనర్ *పూమియన్తళన్దవన్ తమర్ మున్నే*
ఎழுమినెన్ఱిరుమరుఙ్గిశైత్తనర్ మునివర్గళ్*
వழிయిదువైగున్దర్క్కెన్ఱు వన్దెదిరే. ౩.

అ॥ - అన్ఱు - త్రివిక్రమావతారకాలమందు, పూమియళన్దవన్ - భూమినికొలిచినవానికి, తమర్ - భక్తులైనవారియొక్క, మున్నే - ఎదుట, తూబమ్ - ధూపములతోఁగూడ, నల్మలర్ మழை - మంచిపుష్పవర్షమును, పొழிవనర్ - కురుపించినవారై, ఉలగర్గళ్ - ఆయాలోకముల యందున్నవారు, తొழுదనర్ - ఆశ్రయించితిరి. మునివర్గళ్ - మౌనవ్రతముగలవారు, ఎదిరే వన్దు - ఎదుటవచ్చి, వైగున్దర్క్కు - శ్రీవైకుణ్ఠమునకువెళ్ళువారికి వழி - మార్గము, ఇదుఎన్ఱు - ఇదియని (చెప్పి), ఎழுమిన్ఎన్ఱు - వేంచేయుడియని, ఇరుమరుఙ్గు - రెండుప్రక్కలయందును, ఇశైత్తనర్ - చెప్పిరి.

తా॥ ఊర్ధ్వలోకములయందున్నవారు పరమపదమునకువెళ్ళువారికి ధూపముసమర్పించి పుష్పవృష్టికురిపించి "మోక్షమునకుమార్గమిది, ఇట్లు వేంచేయవలయు" నని చెప్పిరని. ౩.

ఎదిరెదిరిమైయవరిరుప్పిడమ్వగుత్తనర్*
కదిరవరవరవర్ కైనిరై కాట్టినర్*
అదిర్ కురల్ మురశఙ్గళ్ అలైకడల్ ముழక్కొత్త*
మదువిరితుழாయ్ముడి మాదవన్ తమర్క్కే. ౪.

అ॥ మదువిరి - తేనెప్రవహించుచున్న, తుழாయ్ - తిరుత్తుழாయిని, ముడి - కిరీటమం దుగల, మాదవన్ - శ్రియఃపతియొక్క, తమర్క్కు - భక్తులకు, ఇమైయవర్ - దేవతలు, ఎదిరెదిర్ - ముందుముందు, ఇరుప్పిడమ్ - వాసయోగ్యమైనస్థానములను, వగుత్తనర్ - ఏర్పాటుచేసిరి. కదిరవర్ - తేజస్సుగల, అవరవర్ - ఆయాదేవతలు, కై - చేతులను, నిరై - వరుసగా, కాట్టినర్ - చూపించిరి. అదిర్ - ఘోషించుచున్న, మురశఙ్గళ్ - భేరీవాద్యములయొక్క, కురల్ - శబ్దములు, అలైకడల్ - అలలుకొట్టుచున్నసముద్రముయొక్క, ముழக்கొత్త - శబ్దముతోసమా నముగానుండినవి.

తా॥ దేవతలు వీరికి విశ్రాన్తిస్థానముగా మార్గమందచ్చటచ్చట స్థానములేర్పఱచి, వీరికె దురుగుండవచ్చి ఇట్లు వేంచేయవలయును ఇట్లువేంచేయవలయునని మార్గము చూపించిరని ౪.

మాదవనెతమరెన్ఱు వాశలిల్ వానవర్*
పోదుమినెమదిడమ్ పుగుదుగవెన్ఱలుమ్*
కీదఙ్గళ్ పాడినర్ కిన్నరర్ కెరుడర్గళ్*
వేదనల్వాయవర్ వేళ్వియుళ్ మడుత్తే. ౫.

అ॥ వాశలిల్ - మార్గమందున్న, వానవర్ - దేవతలు, మాదవన్ తమర్ ఎన్ఱు - వీరుభగవద్భక్తులని యాదరించి, పోదుమిన్ - (మా స్థానమునకు) వేంచేయుఁడి, ఎమదిడమ్ పుగుదుగ - మాయధికారములనుస్వీకరించుడి, ఎన్ఱలుమ్ - అని ప్రార్థించునప్పుడు, వేదనల్వాయవర్ - వేదోచ్చారణముచే విలక్షణమైన ముఖముగలవారు, వేళ్వి - యాగఫలమును, ఉళ్ - వీరియందు, మడుత్తు - సమర్పించి, కిన్నరర్ - కిన్నరులును, కెరుడర్గళ్ - గరుడలోకమందున్నవారును, కీదఙ్గళ్ పాడినర్ - సఙ్గీతములుపాడిరి.

తా॥ మాస్థానమునకు వేంచేసి మమ్ముల ననుగ్రహించుమని దేవతలు ప్రార్థించిరి. కొందఱు తమతమయాగాదిఫలములను వారితిరువడికళ్ళయందు సమర్పించిరి. కిన్నరాదులు గానముజేసిరని. ౫.

వేళ్వియుళ్ మడుత్తలుమ్ విరైకమழ் నఱుమ్పుగై*
కాళఙ్గళ్ వలమ్పురి కలన్దెఙ్గుమిశైత్తనర్*
ఆణ్మిన్గళ్ వానగమాழிయానెతమరెన్ఱు*
వాళొణ్కణ్ మడన్దైయర్ వాழ்త్తినర్ మగిழ்న్దే. ౬.

అ॥ వేళ్వియుళ్ మడుత్తలుమ్ - కర్మఫలమును వీరివద్దసమర్పించుచుండగా, విరైకమழ் - కురిమళముకొట్టుచున్న, నఱుమ్పుగై - నించిధూపములను (సమర్పించి), ఎఙ్గుమ్ కలన్దు - అంతటవ్యాపించునట్లు, కాళఙ్గళ్ - కాహళములనున్ను, వలమ్పురి - దక్షిణావర్తశఙ్ఖములనున్ను, ఇశైత్తనర్ - ధ్వనింపఁజేసిరి. వాళ్ - తేజస్సుగల, ఒణ్ - సుందరమైన, కణ్ - నేత్రములుగల, మడన్దైయర్ - స్త్రీలు, ఆழிయాన్ - చక్రధరునికి, తమర్ - భక్తులైనమీరు, వానగమ్ - స్వర్గమును, ఆణ్మిన్గళ్ - పరిపాలించుడి, ఎన్ఱు - అని, మగిழ்న్దు - సన్తోషించి, వాழ்త్తినర్ - ఆశీర్వాదముజేసిరి.

తా॥ దేవతాస్త్రీలు వీరినిజూచి సత్కరించి యీస్వర్గమును మీరు పరిపాలించుడియని యాశీర్వాదము జేసిరని. ౬.

మడన్దైయర్ వాழ்త్తలుమ్ మరుదరుమ్వసుక్కళుమ్*
తొడర్న్దెఙ్గుమ్ తోత్తిరమ్శొల్లినర్*తొడుకడల్
కిడన్దవెమ్కేశవన్ కిళరొళిమణిముడి*
కుడన్దైయెఙ్గోవలన్ కుడియడియార్క్కే. ౭.

అ॥ తొడుకడల్ - అగాధమైన సముద్రమందు, కిడన్ద - పవ్వళించిన, ఎమ్కేశవన్ - మనకేశవుఁడును, కిళర్ ఒళి - గొప్పతేజస్సుగల, మణిముడి - రత్నకిరీటముగలవాఁడును, కుడన్దై -

తిరుక్కుడన్దయందు పవ్వళించినవాఁడునైన, ఎమ్కోవలక్కు-మన(శీకృష్ణునికి, కుడియుడియార్కుక్కు - కులక్రమముగా దాసులైనవారికి, మడన్దైయర్ - స్త్రీలు, వాழ்త్తలుమ్ - ఆశీర్వాదముజేయు చుండగా, మరుదరుమ్ - మరుత్తులును, వసుక్కళుమ్ - వసువులును, ఎழுమ్ తొడర్న్దు-కొంచెము వెనుక ననుసరించివెళ్ళి, తోత్తిరమ్శొన్నినర్ - స్తోత్రముజేసిరి.

తా॥ (శీవైకుణ్ఠమునకు వెళ్ళుచున్న (శీవైష్ణవులను మరుత్తులును వసువులును స్తోత్రము జేసిరని. ౭.

కుడియుడియారివర్ కోవిన్దనక్కెన్ఱు*
ముడియుడై వానవర్ ముఱైముఱై యెదిర్కొళ్ళ*
కొడియణినెడుమదిల్ కోపురమ్కుఱుగినర్*
వడివుడై మాదవన్ వైగున్దమ్పుగవే. ౮.

అ॥ ఇవర్ - వీరు, కోవిన్దనక్కు - (శీకృష్ణునికి, కుడియుడియారెన్ఱు - కులక్రమముగా దాసులని, ముడియుడై - కిరీటముగల, వానవర్ - నిత్యసూరులు, ముఱైముఱై - క్రమక్రమముగా, ఎదిర్కొళ్ళ - అభిముఖముగావచ్చుటకొఱకు, వడివుడై - సౌందర్యముగల, మాదవన్ - (శియఃపతియొక్క, వైగున్దమ్ - (శీవైకుణ్ఠమును, పుగ - ప్రవేశించుటకై, కొడియణి - ధ్వజముల చేనలంకరింపఁబడిన, నెడుమదిళ్ - గొప్పప్రాకారముగల, కోపురమ్ - గోపురద్వారమును, కుఱుగినర్ - సమీపించిరి.

తా॥ ప్రకృతిమండలమునుదాటినతరువాత నిత్యసూరులు వీరిని పరమపదమునకు దీసికొని పోవుటకై (శీవైకుణ్ఠముయొక్క గోపురద్వారమందు వచ్చి చేరిరని. ౮.

వైగున్దమ్పుగుదలుమ్ వాశలిల్వానవర్*
వైగున్దన్తమరెమ రెమదిడమ్పుగుదెన్ఱు*
వైగున్దత్తమరరుమ్ మునివరుమ్వియన్దనర్*
వైగున్దమ్పుగువదు మణ్ణవర్విదియే. ౯.

అ॥ వైగున్దమ్పుగుదలుమ్ - (శీవైకుణ్ఠమును ప్రవేశించినప్పుడు, వాశలిల్ - ద్వారమందున్న, వానవర్ - నిత్యసూరులు, వైగున్దన్తమర్ - (శీవైకుణ్ఠనాథునిభక్తులు, ఎమర్ - మాకుద్దేశ్యులు, ఎమదిడమ్ - మాస్థానమును, పుగుదు - ప్రవేశించుడి, ఎన్ఱు - అని (చెప్పిరి). వైగున్దత్తు - (శీవైకుణ్ఠమందున్న, అమరరుమ్ - కైంకర్యపరులును, మునివరుమ్ - గుణానుభవపరులును, వైగున్దమ్పుగువదు - (శీవైకుణ్ఠమును ప్రవేశించుటను, మణ్ణవర్ - భూలోకమందున్నవారి, విదియే - భాగ్యము (గలిగినది) కదాయని, వియన్దనర్ - సన్తోషించిరి.

తా॥ (శీవైకుణ్ఠమందలి గోపురద్వారమందున్నవారు మిక్కిలి సత్కరించిరి. కైంకర్యపరులైన నిత్యసూరులును, భగవద్గుణానుభవపరులైనవారును భూలోకమందుండి యిచ్చట రావడము నకు వీరెంతభాగ్యముగలవారోయని యాశ్చర్యపడిరని. ౯.

విదివగై పుగున్దనరెన్ఱు నల్వేదియర్*
పదియినిల్ పాఙ్గినిల్ పాదఙ్గళ్ కழுవినర్*

నిదియునఱుఞ్జుణ్ణముమ్ నిఱైకుడవిళక్కముమ్*
మదిముగమడన్దైయర్ ఏన్దినర్ వన్దే. ౧౦.

అ॥ నిదివర్గై - (మన) భాగ్యముచేత, పుగున్దనర్ - ప్రవేశించిరి, ఎన్ఱు - అని, నల్వే దియర్ - విలక్షణులై వేదమందుప్రతిపాదింపఁబడిన నిత్యసూరులు, పదియినిల్ - స్వస్థానమందు, పాఙ్గినిల్ - ఉపచారపూర్వకముగా, పాదఙ్గళ్ - తిరువడికళ్ళను, కழுవినర్ - శోధించిరి. నిదియుమ్ - నిధివలెనున్న తిరువడికళ్ళనున్ను, నఱుఞ్జుణ్ణముమ్ - మంచిశ్రీచూర్ణమునున్ను, నిఱై కుడమ్ - పూర్ణకుంభమునున్ను, విళక్కుముమ్ - దీపమునున్ను, మదిముగమ్ - చన్ద్రునివంటిముఖ మునుగల, మడన్దైయర్ - స్త్రీలు, వన్దు - ఎదురుగావచ్చి, ఏన్దినర్ - ధరించిరి.

తా॥ మనభాగ్యముచేత వీరిచ్చట వచ్చిరికదాయని నిత్యసూరులు తమ సింహాసనమందు వేంచేయింపఁజేసి వారి శ్రీపాదములనుకడిగిరి. స్త్రీలు మంగళార్థముగా పూర్ణకుంభాదులను దీసి కొని యెదురుగా వచ్చిరని. ౧౦.

వన్దవరెదిర్కొళ్ళ మామణిమణ్డబత్తు*
అన్దమిల్ పేరిన్బత్తడియరోడిరున్దమై*
కొన్దలర్ పొழிల్ కురుగూర్చ్చడగోపన్*శొల్
శన్దఙ్గళాయిరత్తిప్పత్తు వల్లార్ మునివరే. ౧౧.

అ॥ అవర్ - ఆశ్రియఃపతి, వన్దు - వచ్చి, ఎదిర్కొళ్ళ - ఎదురుకుండ వేంచేయఁగా, మామణిమణ్డబత్తు - తిరుమామణి మంటపమందు, అన్దమిల్ - అవధిలేని, పేరిన్బత్తు - మహానన్దము గల, అడియరోడు - భక్తులైననిత్యసూరులతోఁగూడ, ఇరున్దమై - ఉన్నవిధమును, కొన్దు - పువ్వులగొత్తులు, అలర్ - వికసించుచున్న, పొழிల్ - తోటలుగల, కురుగూర్ - కురుకాపురికి స్వామియైన, శడగోపన్ - నమ్మాழ்వార్లు, శొల్ - సాదించిన, శన్దఙ్గళ్ - వేదస్వరూపములైన, ఆయిరత్తు - వెయ్యిపాశురములలో, ఇప్పత్తు - ఈపదిపాశురములను, వల్లార్ - అభ్యసించువారు, మునివరే - భగవద్గుణముల ననుభవింతురు.

తా॥ శ్రీవైకుణ్ఠమందలి తిరుమామణిమంటపమందు నిత్యసూరులతోఁగూడ బ్రహ్మానన్దము ననుభవించుచున్నవిధమును బ్రతిపాదించుచున్న నమ్మాழ்వార్లుసాదించిన యీ పదిపాశురముల నభ్యసించువారు శ్రీవైకుణ్ఠమునకు వెళ్ళి భగవద్గుణానుభవము జేయుదురని. ౧౧.

ఆழ்వార్ తిరువడిగళే శరణమ్

జీయర్ తిరువడిగళే శరణమ్

—•—

## ౧౦ - వ, తిరువాయ్మొఴి.

---

అవతారిక :— ఈ తిరువాయ్మొఴిలో, తామిదివరలో ననుభవించిన యనుభవమంతయు మానసానుభవమగుటచేత వారైభవములను ప్రత్యక్షముగానసుభవించవలయునని యాశించి, సర్వేశ్వరుని యొకక్షణముగూడ విడిచియుండలేక మిక్కిలియార్తులైన యాళ్వార్లకు సర్వేశ్వరుఁడు వచ్చి సేవసాదించి వారిలో సంశ్లేషించి వారియొక్క సకలదుఃఖములనుబోఁగొట్టి వారిమనోరథించిన ప్రకారము వారికి పరమపదమునిచ్చి నిరతిశయానన్దము ననుభవించఁజేసెనని ప్రతిపాదించుచున్నారు.

మునియే నాన్ముగనే ముక్కణ్ణప్పా*ఎన్పొల్లా
క్కనివాయ్ త్తామరైక్కణ్ కరుమాణిక్కమే యెన్ కళ్వా*
తనియేనారుయిరే యెన్ తలైమిశైయాయ్ వన్దిట్టు*
ఇనినాన్ పోగలొట్టేన్ ఒన్ఱుమ్మాయమ్ శెయ్యేలెన్నైయే. ౧.

అ॥ మునియే - (సృష్ట్యాదులకొఱకైన) సఙ్కల్పముగలవాఁడా! నాన్ముగనే - చతుర్ముఖుని కన్తర్యామియైనవాఁడా! ముక్కణ్ - మూడునేత్రములుగల, అప్పా - ఉపకారకుఁడైన రుద్రునికన్తర్యామియైనవాఁడా! కని-పండువలెస్నిగ్ధమైన, వాయ్ - అధరమునున్న, తామరై - పద్మమువంటి, కణ్ - నేత్రములనున్నుగల, ఎన్ పొల్లాక్కరుమాణిక్కమే - ఛేదములేని (అనుభవించని) నీలమాణిక్యమువలె నాకుసేవసాదించిన తిరుమేనుగలవాఁడా! ఎన్ కళ్వా - నన్నపహరించిన (వశీకరించుకొనిన) వాఁడా! తనియేన్ - ఒంటరియైననాకు, ఆరుయిరే - సంపూర్ణప్రాణభూతుఁడా! ఎన్ తలైమిశైయాయ్ - నాశిరస్సుకంటె నధికముగా (సంపూర్ణముగా), వన్దిట్టు - వచ్చి, ఇని-ఇఁక (అనుభవింపించిన) మీఁద, నాన్ - నేను, పోగలొట్టేన్ - పోనివ్వను. ఎన్నై - నన్ను, ఒన్ఱుమ్ - ఏవిధముగాను, మాయమ్ శెయ్యేల్ - వంచనచేయవలదు.

తా॥ బ్రహ్మాదులకంతర్యామియైయుండి సకలజగత్సృష్ట్యాదికారకుఁడవై, నాకుప్రాణభూతుఁడవై, నిరతిశయ సౌందర్యముగల దివ్యావయవములతో నాకుసేవసాదించి నన్నానన్దింపించిన శ్రీయఃపతీ! నేనిఁకవిన్నువదలను. నన్నుసంసారమందు పడద్రోయవలదు సుమాయని. ౧.

మాయమ్ శెయ్యేలెన్నై యున్ తిరుమార్వత్తుమాలై నఙ్గై*
వాశమ్ శెయ్ పూఙ్గుళలాళ్ తిరువాణై నిన్నాణై కణ్డాయ్*
నేశమ్ శెయ్దున్నోడెన్నై యుయిర్వేఱిన్ఱి యొన్ఱాగవే*
కూశమ్ శెయ్యాదుకొణ్డా యెన్నైక్కూవిక్కొళ్ళాయ్ వన్దన్దో. ౨.

అ॥ ఎన్నై - నన్ను, మాయమ్ శెయ్యేల్ - వంచనచేయవలదు. ఉన్ - నీకు, తిరు - సంపత్తై, మార్వత్తు - వక్షస్థలమందు, మాలై - మాలికవలె నలఙ్కారమై, నఙ్గై - పొగడదగినదై, వాశమ్ శెయ్ - (నీతిరుమేనును) పరిమళించఁజేయుచున్న, పూ - సుందరమైన, కుழలాళ్ - కొప్పుగలదైన, తిరు - శ్రీదేవితో, ఆణై - ఒట్టు, నిన్ ఆణై - నీకు ఒట్టు, కణ్డాయ్ - (నేనొట్టు పెట్టి నిర్బంధించినప్పుడు నీ వెట్లు వెళ్ళెదవో) చూడుము. నేశమ్ శెయ్దు - స్నేహము చేసి, ఉన్నోడు - నీతో, ఎన్నై - నన్ను, ఉయిర్ వేఱిన్ఱి - ప్రాణము భేదములేకుండునట్లు, ఒన్ఱాగవే - ఒకటిగానే, కూశమ్ శెయ్యాదు - సఙ్కోచించక, కొణ్డాయ్ - అఙ్గీకరించితివి. వన్దు - వచ్చి, ఎన్నై - నన్ను, కూవిక్కొళ్ళాయ్ - పిలుచుకొనుము. అన్దో - అయ్యో!

తా॥ ఓ శ్రియఃపతీ! నన్ను సంసారమందుంచితివంటే నీతోఁడను నీశ్రీదేవితోఁడను ఒట్టు. నాయందు మిక్కిలి యభినివేశముగలవాఁడవై యిదివఱలో నన్నంగీకరించితివి. ఇఁక మీఁదగూడ విడువకుండ స్వీకరింపుమాయని. ౨.

కూవిక్కొళ్ళాయ్ వన్దన్దో వెన్ పొల్లాక్కరుమాణిక్కమే*
ఆవిక్కోర్ పఱ్ఱుక్కొమ్బు నిన్నలాలఱిగిన్ఱిలేన్యాన్*
మేవిత్తొழுమ్ పిరమన్ శివ నిన్దిరనాదిక్కెల్లామ్*
నావిక్కమలముదల్ కిழங்గే యుమ్బరన్దదువే. 3.

అ॥ ఎన్ - నాకు (భోగ్యభూతుఁడవై), పొల్లా - ఛిద్రములేని, కరుమాణిక్కమే - నీల మాణిక్యమువంటి తిరుమేనుగలవాఁడా! మేవి - అభినివేశముతో, తొழுమ్ - ఆశ్రయించుచున్న, పిరమన్ - బ్రహ్మ, శివన్ - రుద్రుఁడు, ఇన్దిరన్ - ఇంద్రుఁడు, ఆదిక్కెల్లామ్ - వీరు మొదలైనవారందఱికిని, ముదల్ - కారణభూతమైన, నావిక్కమలమ్ - తిరునాభికమలమునకు, కిழங்గే - మూలభూతుఁడా! ఉమ్బర్ - మేలైన నిత్యసూరులకును, అన్దదువే - నిర్వాహకుఁడా! ఆవిక్కు - నాయాత్మకు, ఓర్ - ఒక, పఱ్ఱుక్కొమ్బు - అవలంబవృక్షము, నిన్నలాల్ - నిన్నుతప్ప, యాన్ - నేను, అఱిగిన్ఱిలేన్ - ఎఱుఁగలేను. (గాన) వన్దు - వచ్చి, కూవిక్కొళ్ళాయ్ - పిలుచుకొనుమా. అన్దో - అయ్యో!

తా॥ బ్రహ్మరుద్రాదులకును నిత్యసూరులకును నిర్వాహకుఁడవైన ఓ శ్రియఃపతీ! నిన్నుతప్ప నాకు వేఱవలంబము లేదుగాన నన్నంగీకరించుమాయని. 3.

ఉమ్బరన్దణ్పాழேయో వదనుళ్ మిశై నీయేయో*
అమ్బరనఱ్చోది యదనుళ్ పిరమనరన్ నీ*

ఉమ్బరుమ్యాదవరుమ్ పడైత్త మునివనవన్నీ*
ఎమ్బెరుమ్కారిక్కులుక్ ఎన్నైప్పోరవిట్టిట్టాయే. ౪.

అ॥ ఉమ్బర్ - మహదాదులకంటె మేలై, అమ్ - (సృష్టిశక్తిచే) సుందరమై, తణ్ - చల్లనైన (విచిత్రశక్తిగలదైన), పాழ் - మూలప్రకృతికి నిర్వాహకుఁడా! అదనుళ్ - ఆ మూలప్రకృతిలోనున్న, మిక్కై - విలక్షణమైన జీవాత్మలకు, నీయే - నీవే నిర్వాహకుఁడవైనవాఁడవు. అమ్బరమ్ - ఆకాశమునకును, నల్ - విలక్షణమైన, శోది - అగ్నికిని (తతిమతత్త్వములకును) అదనుళ్ - ఆ పంచభూతమయమైన బ్రహ్మాండములోనున్న, పిరమన్ అరన్ - బ్రహ్మరుద్రులకును, నీ - నీవే నిర్వాహకుఁడవు. ఉమ్బరుమ్ - మేలైన దేవతలనున్ను, యాదవరుమ్ - తక్కిన మనుష్యాదులనున్ను, పడైత్త - సృజించిన, మునివనవన్ - సఙ్కల్పముగలవాఁడవు, నీ - నీవే. ఎమ్బెరుమ్ - ఘోరమైన కార్యములను, కారిక్కులుక్ కు - (నేను) నిర్వహించెదనని మాచి, ఎన్నై - నన్ను, పోరవిట్టిట్టాయ్ - దూరముగావిడిచిపెట్టితివి.

తా॥ ఓ శ్రియఃపతీ! సకల చరాచరములను సృజించి వానికి నిర్వాహకుఁడవైయున్న నీవు నన్ను పేక్షించితివంటె నాకార్యములను నేను నెరవేర్చుకొనఁజాలనని. ౪.

పోరవిట్టిట్టెన్నైనీ పులమ్పోక్కులుక్ కాల్ *పిన్నైయాన్
ఆరైక్కొణ్డెత్తైయన్తో ఎనదెన్బదెన్ యానెన్బదెన్*
తీరవిరుమ్బుణ్డనీరదుపోల వెన్నారుయిరై
అరప్పరుగ* ఎనక్కారావముదానాయే. ౫.

అ॥ ఇరుమ్బు - లోహము, తీర - (తనతాపము) తీరునట్లు, ఉణ్డ - గ్రహించిన, నీరదుపోల - జలమువలె, ఎన్నారుయిరై - నాయాత్మను, అర - పూర్ణముగా, పరుగ - అనుభవించుటకై, ఎనక్కు - నాకు, ఆరావముదానాయే - తృప్తిలేని (నిరతిశయభోగ్యమైన) అమృతమైనవాఁడా! నీ - నీవు, ఎన్నై - నన్ను, పోరవిట్టు - దూరముగావిడిచి, ఇట్టు - అనాదరించి, పులమ్ - విషయాన్తరములయందు, పోక్కులుక్ కాల్ - పడవేయఁదలంచితివంటె, పిన్నై - తరువాత, యాన్ - నేను, ఆరైక్కొణ్డు - ఎవరిని సహాయముగాజేసికొని, ఎత్తై - ఏపురుషార్థమును (సాధించెదను)? అన్తో - అయ్యో! ఎనదెన్బదెన్ - నాదియని చెప్పదగినదేది? యానెన్బదెన్ - నేనని చెప్పదగినదేది?

తా॥ ఇదివఱలో నాకు భోగ్యభూతుఁడవైయుండి నన్ను చక్కగా ననుభవించి యిప్పుడ సంసారమందు బడద్రోయ విచారించుచున్నావు. నేనును నావస్తువులును నీవేగాన ఇఁక నేనొకరిని సహాయముగాజేసికొని యొకపురుషార్థమును సాధింపఁజాలనని. ౫.

ఎనక్కారావముదా యెనదావియై యిన్నుయిరై *
మనక్కారామై మన్ని యుణ్డిట్టాయినియుణ్డొళియాయ్*
పునక్కాయానిఱత్త పుణ్డరీగక్కణ్ శెఙ్గనివాయ్*
ఉనక్కేఱ్కుమ్కోలమలర్ప్పావైక్కన్బా వెన్నన్బేయో. ౬.

అ॥ పునమ్ - తనభూమియందున్న, కాయాంపూ - కల్లువుష్పముయొక్క, నిఱత్త - వర్ణము గలవాఁడవును, పుణ్డరీగమ్ కణ్ - పద్మమువంటి నేత్రములనున్న, శెఙ్కని - ఎఱ్ఱపండువలె స్నిగ్ధమైన, వాయ్ - అధరమునున్నగలవాఁడవునైన, ఉనక్కు - నీకు, ఏఱ్కుమ్ - తగునైన, కోలమ్ - సౌందర్యముగల, మలర్ప్పావైక్కు - కమలవాసినియైనపిరాట్టి విషయమై, అన్బా - స్నేహముగలవాఁడవె, ఎన్నన్బేయో - (వారిని యాశ్రయించిన) నాయందుప్రీతిఁజేసినవాఁడా! ఎనక్కు - నాకు, ఆరా అముదాయ్ - నిరతిశయభోగ్యభూతుఁడవై, ఎనదావియై - నాశరీరమును, ఇన్నుయిరై - విలక్షణమైన నాయాత్మనున్న, మనక్కు - హృదయమునకు, ఆరామై - తృప్తిలేకుండునట్లు (ఆశపడి), మన్ని - నిరన్తరముగా, ఉణ్డిట్టాయ్ - అనుభవించితివి. ఇని - ఇఁకను, ఉణ్డొళియాయ్ - (పూర్ణముగా) అనుభవించుము.

తా॥ శ్రీదేవియందువలె నాయందు మిక్కిలి వ్యామోహముగలవాఁడవై నాశరీరమందును ఆత్మయందును మిక్కిలియాదరమునుజేసితివి. ఇఁకమీఁదగూడ నన్నుపేక్షించక స్వీకరింపుమాయని.

‡‡ కోలమలర్ప్పావైక్కన్బాగియ వెన్నన్బేయో*
నీలవరై యిరణ్డుపిఱై కవ్వి నిమిర్న్దదొప్ప*
కోలవరాగమొన్ఱాయ్ నిలఙ్గోట్టిడైక్కొణ్డవెన్దాయ్*
నీలక్కడల్ కడైన్దా యున్నైప్పెఱ్ఱినిప్పోక్కువనో. ౭.

అ॥ కోలమ్ - సౌందర్యముగల, మలర్ప్పావైక్కు - కమలవాసినియైనపిరాట్టి విషయమై, అన్బాగియ - ప్రీతిగలవాఁడవై (దానిచేత), ఎన్ అన్బేయో - (పిరాట్టికిభక్తుఁడనని) నాయందు ప్రీతిజేసినవాఁడా! నీలవరై - నల్లనిపర్వతము, ఇరణ్డుపిఱై - రెండుచన్ద్రకళలను, కవ్వి - నోటితోకఱుచుకొని, నిమిర్న్దదొప్ప - లేచినట్లువలెనున్న, కోలమ్ - సుందరమై, ఒన్ఱు - అద్వితీయమైన, వరాగమాయ్ - మహావరాహమై, నిలమ్ - భూమిని, కోట్టిడైక్కొణ్డ - కొమ్ముమీఁద నెత్తుకొనివచ్చిన, ఎన్దాయ్ - ఓనాస్వామీ! నీలమ్ - (తనకాన్తిచే) నీలమైన, కడల్ - సముద్రమును, కడైన్దాయ్ - చిలికినవాఁడా! ఉన్నై - నిన్ను, పెఱ్ఱు - లభించి, ఇని-ఇఁకమీఁద, పోక్కువనో - విడిచెదనా?

తా॥ ఓస్వామీ! వరాహావతారమందు భూమిపిరాట్టిని యెత్తుకొనివచ్చి వారితో సంశ్లేషించినట్లును, సముద్రమథనముజేసి శ్రీదేవితో సంశ్లేషించినట్లును సంసారసాగరమందు మగ్నుఁడనై యున్న నన్నుద్ధరించి వాతో సంశ్లేషించిన నిన్ను నేనిఁకమీఁద వదలనని. ౭.

పెత్తినిప్పోక్కువనో వున్నై యెనతనిప్పేరయిరై*
ఉత్తవిరువినైయాయ్ యుయిరాయ్ప్పయనాయవైయాయ్*
ముత్తవిమ్మూవులగుమ్ పెరుస్దాళాయ్త్తూత్తిల్ పుక్కు*
ముత్తక్కరన్దొళిత్తాయ్ యెన్ముదల్ తనివిత్తేయో. ౮.

అ॥ ఉత్త - ఆత్మతోఁజేరియున్న, ఇరువినైయాయ్ - పుణ్యపాపములనిరెండువిధములైనకర్మలకు నిర్వాహకుఁడవును, ఉయిరాయ్ - జీవాత్మలకునిర్వాహకుఁడవును, అవైయాయ్ పయనాయ్ - ఆకర్మలకు ఫలములైన సుఖదుఃఖములకు నిర్వాహకుఁడవును, ఇమ్మూవులగుమ్ - ఈమూడులోకములను, ముత్త - సంపూర్ణముగా, పెరుమ్తాళాయ్ - పెద్దపాదసులెస్పృష్టించి, తూత్తిల్ పుక్కు - ఆపాదలోఁప్రవేశించి, ముత్తక్కరన్దు - అంతటవ్యాపించి, ఒళిత్తాయ్ - కనుపడకుండనుండువాఁడవును, ఎన్ ముదల్ తనివిత్తేయో - నాకు మొదటయిచ్ఛనుగలుగజేసి యాదృచ్ఛికసుకృతమునకద్వితీయకారణభూతుఁడవునైన ఓ శ్రీభగవతీ! ఉన్నై - నిన్ను, పెత్తు - పొంది, ఇని - ఇఁకమీఁద, పోక్కువనో - విడిచెదనా?

తా॥ ఫలసాధనాదులనన్నిఁటికిని నిర్వాహకుఁడవై యుండియు లోకములను సృజించి యచ్చటనన్తర్యామివై కనుపడకనుండియు నాకుయాదృచ్ఛికసుకృతమును గలుగజేసి నన్నంగీకరించిననిన్ను పొంది యింక నేనువదలలేనని. ౮.

ముదల్ తనివిత్తేయో ముఴుమూవులగాదిక్కెల్లామ్*
ముదల్ తనియున్నై యున్నై యెనైనాళ్వన్దుకూడువనో*
ముదల్ తనియఙ్గుమిఙ్గుమ్ ముఴుముత్తుఱువాఴ్ పాఴాయ్*
ముదల్ తనిశూఴ్న్దగన్దాఴ్న్దుయర్న్ద ముడివిలీయో. ౯.

అ॥ ముఴుమూవులగు ఆదిక్కెల్లామ్ - సంపూర్ణమైన మూడులోకములు మొదలైన సమస్తవస్తువులకును, ముదల్ తనివిత్తేయో - నిమిత్తసహకార్యుపాదానములనెడి త్రివిధకారణమై, అఙ్గుమిఙ్గుమ్ - కారణావస్థయందును కార్యావస్థయందును, ముఴుముత్తు - సమస్తవస్తువులయందును, ఉఱు - వ్యాపించి, ముదల్ - ప్రధానమై, తని - అద్వితీయుమై, వాఴ్ - భోగమోక్షములకు, పాఴాయ్ - ఉత్పత్తిస్థానమైనమూలప్రకృతికి నియామకుఁడవై, ముదల్ - (ప్రకృత్యాదులకంటె) ప్రధానమై, తని - అసదృశమై, శూఴ్న్దు - (తనజ్ఞానము చే

శరీరాదులను) వ్యాపించి, అగన్ఱు - ప్రక్కలయందువ్యాపించి, ఆழ்న్దు - క్రిందవ్యాపించి, ఉయర్న్ద - పైనవ్యాపించినదై, ముడివిలి - అంతములేనిదైన జీవాత్మలకు, నియామకుడవై, ముదల్ - ప్రధానుడవై, తని - నిరుపమానుడవై, ఉళ్ళై - నీవైననిన్ను, ఎన్ఱైక్కు - ఎప్పుడు వచ్చి, నాన్ - నేను, కూడువన్ - పొందెదను.

తా॥ సమస్త చరాచరములకును త్రివిధకారణభూతుడవై, చిదచిత్తులకు నియామకుడవై యున్న నిన్ను నేనెప్పుడు పొంది యానందించెదనో యని. ౯.

శూழ்న్దగన్ఱాழ்న్దుయర్న్ద ముడివిల్ పెరుమ్బాழேయో*
శూழ்న్దదనిల్ పెరియ పరనన్మలర్ చోదీయో*
శూழ்న్దదనిల్ పెరియ శుడర్ ఞానవిన్బమేయో*
శూழ்న్దదనిల్ పెరియ ఎన్నవావఱచ్చూழ்న్దాయే. ౧౦.

అ॥ శూழ்న్దు - (మహదాదులను) వ్యాపించి, అగన్ఱు - ప్రక్కలయందువ్యాపించి, ఆழ்న్దు - క్రిందవ్యాపించి, ఉయర్న్ద - పైనవ్యాపించి, ముడివిల్ - నాశములేనిదై, పెరుమ్ - గొప్పదై, (అపరిచ్ఛిన్నమై), పాழ்ేయో - భోగమోక్షసాధకమైన మూలప్రకృతికన్తరాత్మయైనవాడా! శూழ்న్దు - అంతట (జ్ఞానముచే) వ్యాపించి, అదనిల్ - ఆ మూలప్రకృతికంటె, పెరియ - గొప్పదై, పరమ్ - (దానికి నియన్తయగుటచే) మేలై, నల్ - (వికారములేనందున) సలక్షణమై, మలర్ - వికాసస్వభావముగల, శోదీయో - తేజోమయమైన జీవాత్మకు నన్తరాత్మయైనవాడా! శూழ்న్దు వ్యాపించి, అదనిల్ - అంతకంటె, పెరియ - గొప్పదై, శుడర్ - ఉజ్జ్వలమైన, ఇన్బమ్ఞానమేయో - సుఖాత్మకమైన జ్ఞానమూర్తియైన పరమాత్మస్వరూపుడా! శూழ்న్దు - వ్యాపించి, అదనిల్ పెరియ - అంతకంటెగొప్పదైన, ఎన్ అవా - నాయభినివేశము, అఱ - తీరునట్లు, శూழ்న్దాయ్ - (నాతో) సంశ్లేషించితివి.

తా. ఓ శ్రియఃపతీ! దశదిక్కులయందును వ్యాపించిగొప్పదైన మూలప్రకృతికి నియన్తయై దానికంటెగొప్పదైన జీవాత్మకును మేలైనజ్ఞానానన్దస్వరూపుడవైన నీస్వరూపముకంటె నధికమైన, నాయాశ తృప్తిపొందునట్లు నాతో సంశ్లేషించితివని. ౧౦.

అవావఱచ్చూழ் అరియై అయనై అరనై యలఱ్ఱి*
అవావఱ్ఱువీడుపెఱ్ఱ కురుగూర్ చ్చడగోపన్ శొన్న*
అవావిలన్దాదిగళ్ ఆయిరముమ్*ముడివన్ద
అవావిలన్దాదియిప్పత్తఱిన్దార్ పిఱన్దారుయర్న్దే. ౧౧.

అ॥ అవా - అభినివేశము, అఱ - తీరునట్లు, సూழ் - సంశ్లేషించిన, అరియై - సర్వేశ్వరుడును, అయనై - బ్రహ్మకు నంతర్యామియు, అరనై - రుద్రుని కంతర్యామియునైన శ్రియఃపతిని, అలఱ్ఱి - ఉద్ఘోషించి, అవావఱ్ఱు - అభినివేశముతీరి, వీడుపెఱ్ఱ - మహోన్నతమైన పరమపదమును బొందిన, కురుగూర్చ్చడగోపన్ - తిరునగరికి నిర్వాహకులైన నమ్మాழ்వార్లు, శొన్న - సాధించినవియు, అవావిల్ - పరభక్తిచేత, అన్దాదిగళాల్ - అన్దాదిరూపములుగా ప్రవహించినవియునైన, ఇవై ఆయిరముమ్ - ఈ వెయ్యి పాశురములనున్ను, ముడిన్ద - అంతమందు గలిగిన, అవావిల్ - పరభక్తిచే సాధించిన, అన్దాది - అన్దాదిరూపములైన, ఇప్పత్తుమ్ - ఈపది పాశురములనున్ను, అఱిన్దార్ - అధ్యయనముజేయువారు, పిఱన్దార్ - సంసారమందు బుట్టినవారైయే, ఉయర్న్దే - నిత్యసూరులతో సమానులై యుత్తములగుదురు.

తా॥ ఆழ்వార్లయొక్క కోరిక నెఱవేరునట్లు వారితో సంశ్లేషించిన శ్రియఃపతివిషయమై తామాశించిన పరమపదమును బొందిన నమ్మాழ்వార్లు పరభక్తిచే సాధించినవెయ్యి పాశురములనున్ను అందులో పరమభక్తిచే సాధించిన యీపది పాశురములనున్న ధ్యయనము జేయువారిహలోకమందున్నప్పుడే నిత్యసూరులతో సమానులై యందరికి పూజ్యులై యుందురని ౧౧.

ఆழ்వార్ తిరువడిగళే శరణమ్

జీయర్ తిరువడిగళే శరణమ్

౧౦-వ పది, సంపూర్ణము.

ఇది వఱకు తిరువాయ్మొழிలు ౧౦౦-కి పాశురములు ౧౧౦౨.



ఋషిం జుషామహే కృష్ణతృష్ణాతత్త్వమివోదితమ్ ।
సహస్రశాఖాం యోఽద్రాక్షీత్ ద్రావిడీం బ్రహ్మసంహితామ్ ॥



## ఈ



## ఉ

## ఏ



## ఒ

## యా



## వ



## వా



తిరుమల తిరుపతి దేవస్థానం ప్రెస్. తిరుపతి. ప్ర. 500 18-8-60.